శ్రీరామ

# పీఠిక.

---

ఈ చూడామణి నాపదునెనిమిదవనాటకము నన్నుఁ బోషించుచున్న శ్రీపీఠికాపురాస్థానమహారాజావారు దీని నచ్చువేయించిరి. వారికి, వారికుటుంబమునకు భగవంతుఁడు సర్వశ్రేయముల నిచ్చుఁగాక

నామిత్రులగు బ్రహ్మశ్రీ కూచి నరసింహముగారు దీనికి నాందీప్రస్తావనలను వ్రాసి యిచ్చినారు ఆయన కనేక నమస్కారములర్పించుచున్నాను.

పా॥ లక్ష్మీనరసింహారావు.

# ఇందు వచ్చు పాత్రములు.



## పురుషులు

వినయాదిత్యుడు—కాశ్మీరాధిపతి

ఉద్భటభట్టు—సేనానాయకుడు.

దామోదరశర్మ—మంత్రి.

| | |
|---|---|
| జగన్నాథుడు | విష్కంభమున వచ్చువారు |
| సీతారాముడు | |
| వికటుడు | |
| వామనుడు | |
| రాముడు | |
| లక్ష్మణుడు | |

భటులు.

## స్త్రీలు.

పద్మావతి—స్త్రీరాజ్యమునకు రాణి

మందాకిని—మంత్రి.

దుర్గ—సేనానాయిక.

చపల—దాసి.



శ్రీరామ.

# చూడామణి.



## నాంది.

శా. శ్రీపుంసవ్యవహారకారణవపు । ర్భేదస్థితి న్దాఁటి త
ద్వ్యాపారోత్కరకారకం బగు మనః । ప్రాకారముం దాఁటి చి
ద్రూపుండై యుభయప్రబోధనచణ । ప్రోద్దాముఁడౌ నీశ్వరుం
డాపాదించుత మీకు నిత్యశుభసౌ । ఖ్యానందసందోహముల్.

(నాంద్యంతమందు)

సూత్రధారుఁడు—బావా! పారిపార్శ్వకా!

పారి—(ప్రవేశించి) ఏమిసెలవు?

సూ—నాటకము ప్రదర్శనమునకు సిద్ధముగ నున్నదా?

పా—ఆధునికకవివరేణ్యుఁడగు పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారి పదునెనిమిదవ నాటకమైన చూడామణియా?

సూ—ఔను.

పా—ప్రదర్శనోన్ముఖమై యున్నది. కథ యాయనదేనా?

సూ—పేరికిఁ గల్హణపండితునిది యథార్థముగాఁ గవిది.

పా—అనఁగా—

సూ—కల్హణపండితకృతరాజతరంగిణిలోని స్వల్పకథాంశముఁ దీసికొని దానిని స్వబుద్ధిచే విపులీకరించి ప్రశస్తమైన నాటకముగాఁ జేసినాఁడు. కథమాట యడిగితి వేల?

పా—ఏమియు లేదు కాని—

సీ. పద్మావతీదేవి । ప్రభ్వి మునల్లిక
మందాకినీకాంత । మంత్రిపుత్రి
చాకచక్యోజ్జ్వల । చపల సేవకురాలు
సేనాని దుర్గాఖ్య । చిగురుఁబోఁడి
ప్రాచీనపౌరస్త్య । రమ్యనామంబుల
నెనసి స్త్రీపాత్రంబు । లిందు బావ!
చతురుపాయాన్విత । శౌర్యసాహసములఁ
బ్రస్తుత పాశ్చాత్య।వనితల తలఁ

గీ. దన్నుచున్నారు వీరిచే।తలను గాంచి
పౌరుషము పురుషుల దని । పలుకు నెవఁడు?
శ్మశ్రుహీనతమాత్రాన । మగువ నబల
తన్వి యని యింక నేకవి । తాను వ్రాయు?

సూ—ఇదియా నీ కానికిఁ గారణము. పౌరుషలక్షణము ప్రాచీప్రాచ్యవనితలది కాదని నీ వెట్లు చెప్పఁగలవు? రాజస్థానకథావళి చదువలేదా? అం దెందఱు హైందవవీరకాంతామణులు స్వమానస్వదేశరక్షణార్థము ప్రాణత్యాగముఁ జేసికొనినట్లు చెప్పఁబడియున్నదో యెఱుఁగుదువా?

గీ. శూరధర్మము మగవారి । సొమ్మటంచు
నల్ల పాశ్చాత్యవనితల । ముల్లె యంచుఁ
జెప్పఁ జనదందు హైందవ । స్త్రీలయందు
వారి మించిన కాంతలు।న్నారు బావ!

దేహపుష్టిఁ బట్టి । ధీరత్వ ముండదు
మనసుఁ బట్టి యట్టి । మహితగుణము
లుండుఁ జూడు పెద్ద । కొండంత యేనుఁగు
లొంగిపోవు చిన్న । సింగమునకు.

ఉ. మాయలు పన్ని యెట్టిమతి।మంతుల నైనను మోసపుచ్చి గో
మాయువుఁ జీయను న్నదతి । మంచి యొనర్చి పరోపకారము
ల్సేయఁగఁ దాను గంకణముఁ । జేతిని గట్టిన నంతరాయము ల్
వేయును గోటిఁ జిమ్మి నెఱ । వేర్చుకొనుం బని మేరుధీరతన్.

పా—సత్యమే. వృద్ధుఁడైనను కవి యీప్రపంచసత్యమును తన నాటకములోఁ జక్కగాఁ జిత్రీకరించినాఁడు.

సూ—'వృద్ధుఁడైనను' అనెదవేమి ? 'వృద్ధుఁడౌటచే' అనుము.

గీ. ఒగరు పులుసు విడిచి । యురుమధురం బగు
భక్ష్యమైన కాయ । పండ కొలఁది
కవి కవితయు నట్లె । క్రమముగా హృద్యతఁ
గాంచు వృద్ధివయసు । గడుచుకొలఁది.

పా—ఔను బావా ! చూడామణి యని పేరు పెట్టిరిగదా- ఆపేరు సార్థకముఁ జేయునది యందలి యేపాత్రము ?

సూ—బుద్ధిశాలినీవి అదినీవే నిర్ధారణఁజేయఁ బ్రయత్నింపఁగూడదా?

పా—సీ. విజితేంద్రియుం డైన । వినయభాస్కరుఁ డేమి ?

సూ— పరరాష్ట్ర జయతృష్ణ । పాలఁబడియె

పా— నుద్భట భట్టదా । మోదరశర్మలో ?

సూ— చెలువల వలలలోఁ । జిక్కి చెడిరి

పా— మందాకినీమంత్రి । మాట యేమందువో ?

సూ— పరుఁడైన మగమంత్రి । మరగి చనియె

పా— భీరు దుర్గను నేను । బేర్కొనఁ జపలయొ?

సూ— స్వచ్ఛానురాగవా । చాలయమ్యె

పా—గీ. నింకఁ దెలిసెదు జుమి నిక్క । లంకసత్య
శీల పద్మావతీరాజ్ఞి । స్త్రీలలామ
దివ్యనిస్తులశౌర్యయే । తెచ్చెఁ బేరు

సూ— నిజము మఃమ్మాటి కీమాట । నిజము నిజము.

పా—అదిగో- మందాకినిమున్నగువారితోఁ బద్మావతీదేవి వచ్చుచున్నట్లున్నది. మన మిఁకఁ బోవుదము రమ్ము.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)



శ్రీ

# చూడామణి

## ప్రథమాంకము

ప్రదేశము:— స్త్రీరాజ్యమునఁ గోట.

[ప్రవేశము:— మందాకిని, దుర్గ.]

మందా — దుర్గా! సేనాధినాయికా! ఈ స్త్రీరాజ్యమునకు వినయాదిత్యునివలనఁ బ్రమాదము కలుగునేమో కదా!

దుర్గ — ప్రధానాగ్రణీ! వినయాదిత్యుఁడు సర్వవిధములఁ బితామహుఁడగు లలితాదిత్యుని బోలినవాఁడు. అతఁడు చేసినట్లే యీతఁడుకూడ దిగ్విజయ మొనర్చుచున్నాఁడు. ఈధాటి మనరాజ్యమునకుఁగూడ రావచ్చును. వచ్చినపిమ్మట నేమగునో వేఱ చెప్పనేల?

మందా — రావచ్చును గాదు రానేవచ్చినది. వినయాదిత్యునియొద్ద నుండి యాతని సభాపతియు, విద్వాంసుఁడును నగు నుద్భట భట్టుఁ డనునాతఁడు రాయబారిగా వచ్చియున్నాఁడు. ఆతని నుచితరీతిని గౌరవించి కేశవస్వామియాలయసత్రమున విడియించి రాణిగారిదర్శనము చేయింతునని చెప్పివచ్చితిని.

దుర్గ — మందాకినీ! ఈపండితుఁ డిప్పుడు వచ్చినంతమాత్రమున వినయాదిత్యుఁడు మనరాజ్యముపై దాడివెడలునని యెట్లు చెప్పవచ్చును?

మందా—ఆ పండితునివలననే కొంత సూచనగా వింటిని.

దుర్గ—అట్లైన మన మింక యుద్ధమునకు సిద్ధముగా నుండవలసి నట్లే తోఁచుచున్నది.

మందా—అది మహారాజ్ఞియాజ్ఞను బట్టియుండును గాదా ?

[నేపథ్యమున] జయా ! ప్రమదాశిరోమణికి- జయా ! జయా పద్మావతీరాజ్ఞీమణికీ జయా!

మందా—(లేచి) రాణిగారు వచ్చుచున్నారు

[పద్మావతియు, దాసి చపలయుఁ బ్రవేశింతురు.]

దుర్గ—(లేచి) ప్రభుశిఖామణీ ! నమస్కారము.

పద్మా—కళ్యాణమస్తు.

మందా—అమ్మా ! నమస్కారము.

పద్మా—(కూరుచుండి) కళ్యాణమస్తు- మీరిద్దఱుఁ గూరుచుండుఁడు. చపలా! నీవు లోనికిఁబొమ్ము. (చపలపోవును.) మంత్రీ! నీవు- అదేమి? నీమొగమునం దేదియో సందేహమో త్రొటుపాటో పొడకట్టుచున్న దేల? సేనానీ ! నీమొగము వెలవెలలాడు చున్న దెందుచేత?

మందా—అమ్మా ! వినయాదిత్యమహారాజు మనపై దాడివెడలునని తెలియుచున్నది. ఆతనిరాయబారి వచ్చి యేలినవారిదర్శన మపేక్షించుచున్నాఁడు.

పద్మా—సెబాస్! అంతకంటె మనకుఁ గావలసిన దేమి? ఇందులకై మనము మహోత్సాహ మొందవలసియుండఁగా— నయ్యయ్యో ! ఇట్లు త్రొక్కులాడుచున్నారా? ఇట్లుజడి నందు చున్నారా ? తప్పు కాదా?

దుర్గ—అమ్మా! వినయాదిత్యచక్రవర్తి మహాశౌర్యసంపన్నుఁడు. సపాదలక్షరథముల కధికారి.

పద్మా—అందుచే మఱింతమంచిది- నీవనినట్లాతఁడు మహాసత్వసంపన్నుఁడే యైనచో నాతఁడు మనకెదురై పోరాడుట మన మహాభాగ్యముకాదా! లేడిపిల్లపైఁ బడఁబోవుసింహము మెచ్చుకొందురా? సింహమున కెదుట నిల్చు లేడిపిల్లను బలి యందురా? ప్రబలశౌర్యసంపన్నుఁడైన శత్రుఁడు దారసించినప్పుడే మనఘనతకాని మనచుట్టుప్రక్కలనున్న యెడారులలోని కొండదొరల నెందఱఁ జంపిన మనకు ఘనతయేమున్నది? అదిగాక, ఆతఁడు మహాశౌర్యసంపన్నుఁడని నీవంటివి. ఏమీ? ఆతఁ డొక్కఁడే ప్రపంచమున శూరుఁడా? జగత్తంతయు గొడ్డుపోయెనా? శూరత్వ మొకనిసొమ్మా? అవసరమును బట్టి శౌర్యము—అంతకంటె నేమున్నది? మయూర మెంత స్వల్పమగుపక్షి. అది తప్పించుకొనుట కవకాశము లేనిచోట దానిని స్పృష్టి కధికారియైన మనుజుఁ డెవఁడొక్కఁడనీ- అది యాతనికనులు పీకివేయునో లేదో? అంతవఱకు కొమ్ములకు—నీ కాలిత్రొక్కును సహింపలేని గండుచీమ చిన్నదర్పొక్కని పీకివేయదా? దానిశౌర్యముముందు నీశౌర్యము హెచ్చని నీవు చెప్పఁగలవా? శౌర్యప్రకటనమునఁ బెద్దపులి ఘూంకార మెట్టిదో దోమహుంకారముకూడ నట్టిదే సుమా.

మందా—అమ్మా! అంతవఱకు సత్యమే కాని సృష్టిలోఁ బెద్దజంతువుచేఁ జిన్నజంతువు చచ్చినట్లు మన మావినయాదిత్యునిచే—

పద్మా—హే! హే! చావునకా జడియుచుంటివి? చావనివా రెవ్వరైన నున్నట్లు నీవు వినియుంటివా? జడియుటచేఁ జావెవ్వరికిఁ దప్పెనో యొక్కనిని జెప్పఁగలవా? మహాశౌర్యవంతులలో మాత్రము బ్రదికినవా రెవ్వరు? ఈవినయాదిత్యుని తాతయైన ప్రతాపాదిత్యుఁ డగు లలితాదిత్యుఁ డేమయ్యెనో యేకొండ

పాముచేతనో యేవిషపుసాలి పురుగుచేతనో చచ్చెనని విని యుండలేదా? ఆతని కందుచేఁ దక్కువయేమి? కావున చచ్చి పోవుదుమనిమాత్ర మెన్నఁడు చెప్పవలదు. అది నీ వనుకొని నట్లు లోపమే యైనచో భగవంతునిది కాని మనదా?

మందా—శౌర్యములేక కాని మరణభీతికలిగి కాని నే నట్లనలేదు. శౌర్యము విని యోగింపదని యెఱిఁగియుండియు సాహసించుట కాని చావు నిశ్చయ మని యెఱిఁగియుండియుఁ జావఁబూనుట కాని వీరలక్షణము కాదేమో యని భయముతో మనవిచేసికొనుచున్నాను. సమయజ్ఞతయే శౌర్యమున కలంకారము కాదా!

గీ. మంచుగడ్డలు మిన్ను వర్షించునపుడు
కాతరుఁడు కాఁడు తల దాఁచఁ । గడఁగువాఁడు
సింధునది పొంగి ప్రళయంబు । సేయువేళ
నూరు త్యజియించి చనువాఁడు । భీరుఁ డగునె?

గీ చాయశక్తిమొనకు । జ్ఞానమిచ్చెడివాఁడి
శౌర్యసార మీయఁ । జాలదమ్మ!
బాణజాలమునకుఁ । బ్రతిభ యిచ్చెడివేగ
మెంత భుజబలంబు । నీయఁ గలదె?

పద్మా—మంత్రీ! నీవు చెప్పినమాటలు నాకు నచ్చకపోలేదు. ఇహలోకజీవనమే ప్రధానమగువారికి నీమాటలు పరమార్థములే కావచ్చును. కాని యుత్తమమై శాశ్వతమైన పరలోకజీవనమును నమ్ముకొన్నవారము కాని తుచ్ఛమైన యీలోడి తెడు బ్రదుకును నమ్ముకొన్నవారము కాముకదా! రాజునకు రెండు విధులు—శత్రుమారణము రాష్ట్రపాలనము. ఈవిధులను నిర్వర్తించుటలో మరణమే వచ్చునా? రానిమ్ము. మనలను భగవంతుఁడైనఁ నిందింపవలసిన పనిలేదే- మన కింక నుత్తమశా

శ్వతలోకనివాసము సమకూడక తప్పునా? అది మంచిదా? ఇప్పు డిట్లో యుద్ధమును దప్పించుకొని తుచ్ఛమైన బ్రదుకు బ్రదుకుట మంచిదా? నే నొక్కమాట చెప్పుచున్నాను. వినుఁడు-కాని— సేనానీ! నీ వింతవఱకు మాటలాడకుంటి వేల?

దుర్గ—మీ సెలవు కాని నే నేమి చెప్పఁగలనమ్మా?

పద్మా—నేను చెప్పఁబోవున దేమనఁగ: వినయాదిత్యుఁడు మనపై దాడివెడలు ననుకొందము. పెద్దసైన్యమే యెప్పుడు గెల్చునని ప్రకృతిపుస్తకమందు సూత్రమేదియు లేదుగదా! మనమే యేల గెలువఁగూడదు? లేడి పులిని జంపునా లేదా? అది కాక మనరాజ్యముచుట్టు నెడారులు; మంచినీరు దొరకక, వడఁగొట్టి, తాపజ్వరములచేత వారిలో ననేకు లేల చావఁగూడదు? మనమే గెల్చినయెడల మనఖ్యాతికిఁ ద్రిభువనములు చాలునా? అందఱను గెల్చినలలితాదిత్యునిపౌత్త్రిని—నాఁడు వా రాలెంప నీలెంప వాయించి పంపివారని మనకుఁ గలుగఁబోవు ఖ్యాతి యుత్తరసృష్టిలోఁగూడ నిల్చియుండుననుట యతిశయోక్తికాదే! ఒకవేళ మన మోడిపోవుద మనుకొందము. ఓడినను మనకే ఖ్యాతి సుమా! ఉచ్చింత కాయయంత స్త్రీరాజ్యముపైకి వీరాధివీరుఁడు లక్షలకొలఁది సైన్యముతో బయలుదేఱినాఁడు. అయిననేమి; అట్టిమహారాజసైన్యమును గాంచి స్త్రీలు వడఁకిరా? శరణుసొచ్చిరా? వెనుదీసిరా? కట్టకడపటి రక్తపుఁజుక్కవఱకుఁ గదన మొనర్చి వీరస్వర్గ మొందినారే! వహవ్వా! దేవతలు పుష్పవృష్టిఁ గుఱియఁదగినదనియు వినయాదిత్యుని జయముకంటెఁ బద్మావతి యపజయమే లక్షగుణములు శ్లాఘ్యమనియు జనులు తాత్కాలికముగనైనఁ బ్రశంసింపరా? స్త్రీలశక్తిని, బుద్ధిని, విద్యను బ్రశంసించినయెడల

నిప్పటిపురుషులు సహింపలేరు కాని యీదినము లెల్లకాల ముండునా? స్త్రీలకు మంచిదినములు రావా? కొన్నివందల సంవత్సరములు దాఁటినతరువాతనైన స్త్రీపురుషులు తత్త్వమున నొక్కటియేకాక స్త్రీయే పురుషునికంట బుద్ధిలో, యోగ్యతలో ఘనురాలని జనులు నిశ్చయింపకుందురా? ఆ దినములలో శిష్టులైన నొకకవి బయలుదేఱి చరిత్రములలో నే మూలనో యొక్కటుంక్తిలో విధిలేక యిముడ్పఁబడఁబోవు మన రాష్ట్రకథను విపులపఱచి నాటకముగాఁ జేసి విద్యాపోషకులైన యేమహారాజమార్తాండునెదుటనో దానిని బ్రదర్శింప నప్పటిసభ్యులు ప్రశంసాపూర్వకముగా మనకుఁ గరతాళము లీయరా? కావున మనకు జయాపజయములు రెండును శ్లాఘ్యములే. ఈసంగతి నిర్ధారణ మొనర్చుట కింతదూరము చెప్పవలసివచ్చినది. మంత్రీ! ఇఁక రాయబారిని బిలిపింపుము.

మందా—ఎవఁడురా ! అక్కడ.

[నేపథ్యమున] చిత్తము. ఏమిసెలవు?

ప—చపలచే నాతని బిలిపింపుము.

మందా—భటుఁడా! నీవు పోయి చపల నిటకుఁ బంపుము.

[నేపథ్యమున] చిత్తము.

ప—సేనానీ! యుద్ధమునకుఁ గావలసిన దంతయు సిద్ధపఱుపుము. నీవు పొమ్ము. ఒక్కనిముసమైన జాగుసేయకుండ సమస్తప్రయత్నములను జేయుట కాజ్ఞాపింపుము. నీతోఁ దరువాత మాటలాడి వివరములన్నియుఁ దెలిపెదను.

దుర్గ—చిత్తము. (పోవును.)

[నేపథ్యమున] చపల వచ్చుచున్నది.

[చపల ప్రవేశించును.]

చపల—అమ్మా ! ఏమిసెలవు ?

మందా—చపలా ! నీవు కేశవదేవాలయసత్రమునకుఁ బోయి యచ్చట విడిసియున్న యుద్భటభట్టను కాశ్మీరదేశపండితుని రాణిగారి దర్శనమునకు వేగఁ దీసికొని రమ్ము.

చపల—చిత్తము. (నిష్క్రమించును.)

ప—వినయాదిత్యుని దేశవిశేషములు, బలవిశేషములు మొదలగునవి యారాయబారి నీ వడిగి తెలిసికొనుము. ఇతరాంశములఁ గూర్చి నేను మాటలాడెదను.

మందా—చిత్తము.

[నేపథ్యమున] అయ్యా ! ఇటు; ఇటు.

మందా—రాయబారిని దీసికొని చపల వచ్చుచున్నది.

[చపలయు, నుద్భటభట్టుఁడు ప్రవేశింతురు.]

మందా—(లేచి) అయ్యా! పండితోత్తమా ! దయచేసి యీపీఠమునఁ గూరుచుండుఁడు. నమస్కారము.

ప—అయ్యా ! వినయాదిత్యుని దూతవైన నీకు స్వాగత మర్పించుచున్నాను. చపలా ! నీవు పొమ్ము

(చపల నిష్క్రమించును.)

ఉ—రాజ్ఞీమణీ ! మా మహారాజుగారి సందేశము వినఁ బ్రార్థించుచున్నాను.

మందా—పండితవర్యా ! మీ మహారాజుగారి సందేశము మీ రెంతసేపు చెప్పవలయును మే మెంతసేపు వినవలయును. అది రవంతసేపైనతరువాత మీరు మనవిచేయవచ్చును. మే మీ యెడారులనడుమ నాగరకప్రపంచమునకు దూరముగ నున్నాము. ఇక్కడకు విద్వాంసు లెవరువచ్చెదరు ? మీ మహా

రాజుగారికి నేఁటికి మాయందు దయకలిగినది కావున మిమ్మి టకుఁ బంపినారు. మీరాష్ట్రమునందలి విశేషము లేమైన మాకు బోధించి మమ్ముఁ గృతార్థులను జేయవలయును.

ఊ—(తనలో) మా రాజ్యరహస్యముల నపేక్షించుచున్నారు. (ప్రకాశముగా) మంత్రిశిఖామణీ! నాగరకులలో నేమి, యనాగరకులలో నేమి, మేడారులనడుమ నున్నవారిలో నేమి, చెఱకుతోఁటలనడుమ నున్నవారిలో నేమి, కోటలలో నున్నవారిలో నేమి, గుడిసెలలో నున్నవారిలో నేమి, సోమపాన మొనర్చువారిలో నేమి, రక్తపాన మొనర్చువారిలో నేమి, పౌర్వాత్యదేశములం దేమి, పాశ్చాత్యదేశములం దేమి, దక్షిణధ్రువమం దేమి, యుత్తరధ్రువమందేమి, మింట నేమి, గాలిలో నేమి, సముద్రములో నేమి, యెల్లయెడలఁ బ్రకృతిసామాన్యముగ నొక్కరీతిగా నున్నది. ఒకచోటి విశేషములు, రెండవచోటి వారు వినఁదగిన వేమియు లేవు. అన్నిచోట్ల నొక్కటే విశేషములు. ప్రకృతి యెంతకాలము పాడినను నొక్కటే పాట; యెంతకాల మాడినను నొక్కటే మాట.

సీ. ఎగసిపోయిన యంబువు । లెగసిపోవ
వెలితి కాసంతయును లేక । వెలయు నబ్ధి;
రాలిపోయిన చుక్కలు । రాలిపోవ
సూది కెడమైన లేకుండఁ । జుక్కలలరు;
వెడలిపోయిన ప్రాణులు । వెడలిపోవ
నాఁకటపుబాధ నొందెద । రింకఁ బ్రజలు;
మీఁదఁబడు కోటి యుగములు । మీఁదఁబడఁగఁ
బడుచుఁదనమునఁ బసఁ జెందుఁ । బ్రకృతికాంత;
దాని నిది లాఁగి యయ్యది । దీని లాఁగి

యొకటి యొకదాని యాశ్రయ । మొంది తిరుగు
గ్రహము లట్టులు మనుజు లొ।క్కనిని నొక్క
రంటి తిరుగుదు రశియాన । లావరింప;
నింట బంగారుబొమ్మయా । నింతి యుండ
పొట్టదాసికై నరుఁ డట్టి । లొట్టవ్రేయుఁ
దనదుసుఖ మేదొ తనలోనఁ । దనరియుంకఁ
బరునిపాదాలపైఁ బడి । ప్రాకులాడు;
కన్నె యాటలలో బిడ్డఁ । గాంచుచుండ
వృద్ధ మొగలిపూవుల జడఁ । బెట్టి కులుకు
తండ్రి తలపాగయాసతోఁ । దనయుఁ డుండ
ముదుకఁ డగుతండ్రి మీసాలఁ । బులుము రంగు;
మాఃసికి నున్న దేదైన । లేని దగును
లేనిదే యుండఁ దగినది । లేనిదాని
కేడ్వఁదగినది యుండి లే । కేడ్వ లేక
లేక యేడుపె బ్రదుకగు । లోకమందు ;
అన్నమున్న యాతనికి మం।దాగ్ని బాధ
అశనశూన్యున కాఁకలి । యపరిమితము
బ్రహ్మచారికి స్త్రీవాంఛ । భైరవంబు
మహితగృహమేధి కద్ది సం।శయము సుమ్ము;
ఒక్క మాంధుకరపుజోలి । నున్నకూడు
భ్రాతలును దల్లి తిని సుఖ।పడుదు రెలమిఁ
బ్రబలతమరాష్ట్రమండలి । ప్రభువు లిద్ద
ఱట్టె తలగొట్టికొని చత్తు । రాహవమున.

మందా——అయ్యా ! మా కీప్రకృతిగొడవయంతయు నెందులకు ?
కడుపునొప్పికి మందడుగ వైద్యశాస్త్రోపన్యాస మిచ్చుట

తగునా ? మీ రాష్ట్రప్రజలు సుఖముగ నున్నారా? మీ మహారాజు సుఖముగ నున్నాఁడా ? మీపంట లెట్లున్నవి ? మీమహారాజు విద్యలను బోషించునా ? ఇట్టివేమేము కోరగ—

ఉ—పంటలు బాగుగానుండుటచేతనే మారాష్ట్రప్రజలు సుఖులై యున్నారు. ప్రజలు సుఖముగా నుండటచేతనే మహారాజు సుఖముగా నున్నాఁడు. మా మహారాజు విద్యాపోషకుఁడు— మహావిద్వాంసుఁడు.

మందా—అతని విద్యాపోషణమును గూర్చి కాని పాండిత్యమును గూర్చి కాని మేము వినలేదు. కాని యత్యసాధారణమైన యాతని దిగ్విజయోన్మాదమును గూర్చిమాత్రమే వినియు న్నాము. తన దేశమును బంధుఁ డాక్రమించుకొని పరిపాలించుచుండఁ దాను పరరాష్ట్రపరిగ్రహణప్రయత్నమున నుండుట యున్మాదముకంటె భిన్నమా! తనకాంతను దా నేలుకొనుచు సుఖమున నుండువాఁడు సంసారి. తనకాంతను దా నేలుకొనుచుండియుఁ బైకాంతల నపేక్షించువాఁడు దుష్టుఁడు. తన కాంతను బరార్పణమొనర్చి తాను బరకాంతలవెంటఁ దిరుగువాఁ డెట్టివాఁడో మాకుఁ దెలియునా ? విద్వాంసుఁ డవఁగ వాఁడే కాఁబోలు.

ఉ—(తనలో) మా మహారాజు విద్యాపోషణమునఁ జేసిన సత్కార్యము లిన్నన్నియా? గొప్పగొప్ప పండితులను రావించి విచ్ఛిన్నమైన పతంజలిభాష్యమును బూర్తిచేయించినాఁడు. మనోరథ, శంఖదత్త ఘటకసంధిమత్యాదికవీంద్రుల నెందఱనో పోషించుచున్నాఁడు. తాను భాష్యాంతవ్యాకరణ మధ్యయనమొనర్చిన మహావిద్వాంసుఁడు. ఇవియన్నియు మీ రెంతమాత్రము నెఱుఁ

గనే యెఱుఁగరు. తాను దిగ్విజయయాత్ర వెలువడెడినప్పుడు స్థాలకుఁడు తనరాజ్య మాక్రమించుకొనె నన్నలోపము మాత్రమే విని చెప్పిపొడుచుచున్నారు. నిజమే. ప్రజలజిహ్వ లందు దుష్కృతికున్నవ్యాప్తి సత్కృతికి లేదు.

గీ. ప్రభుని సత్కార్యచయము వ్యాపింపఁజాల
దెమరుగాలిని సుమరజ మెక్కనట్టు
లతని దుష్కృతి వ్యాపించు నన్నిదిశల
శీఘ్రతమముగఁ బెనుగాఱుచిమ్మువోలె ;
మెల్లగను మల్లెపూఁదీఁగె యల్లుకొనును
శీఘ్రము గ వ్యాప్తి గనుబొమ్మజెముడుకంప
మేటిగుణమున కెపుడు తాఁ బేటినడక
దుర్గుణమునకు మిడినాగు దుముకులాట ;
త్యాగి యగు రాజునకు దంభుఁ డనెడుతిట్లు
క్రూరుఁ డనుతిట్లు శూరుఁడౌ క్షోణిపతికిఁ
బిఱికి యనుతిట్లు సాధుఁడౌ పృథ్వీపతికి
విరసుఁ డనుతిట్లు పరవశూ విముఖపతికి ;
ప్రభుని మంచినే చెడ్డగాఁ బ్రజలు తలఁపఁ
జెట్ట నెటుచూతురో యింకఁ జెప్పవలెనె ?
జెట్టిపోతుగ జెట్టిని జెప్పుచుండు
జిహ్వ నంటిన వెండ్రుక జేరుబొందు ,
సత్కృతికి దుష్కృతికిఁ గూడ జనులనిందఁ
బొంది శ్రమఁజెందు ప్రభువుగాఁ బుట్టుకంటె
నేమిచేసిన నెవ్వరు నెంచనట్టి
నామరహితుఁడై పుట్టుటే నయము మిగుల.

మందా—అయ్యో! ఏమి యోజించుచున్నారు? మీ మహారాజును గూర్చి విన్నమాట లేవియో చెప్పినాను. అసత్యములైన మన్నింపవలయును.

ఉ—లేనిపోనిమాట లింక నెందులకు? నాసందేశ మేదియో నిర్వర్తించెదను. రాజ్ఞీమణీ! మామహారాజుగారు దిగ్విజయయాత్రకై బైలుదేఱి నేపాల, కన్యాకుబ్జాధీశప్రముఖుల నెందఱినో యోడించినారు. మఱియు—

ప—అయ్యో! సంతోషమే కాని మన్నించి యూఁగుఁడు. మీరాజు మహావిద్వాంసుఁడని చెప్పితివి గదా, పరోపకారముకంటెఁ బుణ్యమును పరపీడకంటెఁ బాపమును లేవని తా నెఱుఁగడా? అందులో బౌద్ధమతస్థుఁడనికూడ వింటిమి. తనవంటి యిందఱ రాజులను దాను బీడించు టెందులకు? ఇప్పుడు తన కీదిగ్విజయయాత్రలో నేమిపని? ఇదియేమి కృతయుగ మనుకొనెనా? త్రేతాయుగ మనుకొనెనా? తాను మాంధాత యనుకొనెనా? రావణాసురుఁ డనుకొనెనా? ఇప్పటికాలము వేఱు ఇప్పటి నాగరకత వేఱు. భుజబలప్రధానమగు కాలము గతించినదని తా నెఱుఁగఁడా? రాష్ట్రీయన్యాయమును జూడనక్కఱలేదా? ఎవరిమానమున వారు వారిరాజ్యముల నేలుకొనుచు సుఖముగా నుండఁగ వారియందఱపైఁ దన కిప్పుడు దండయాత్ర యెందులకో? తనకు మహాబల మున్నదనియా? ఇతరరాజులలో నైక్యము లేకపోయెనుగాని మేము నల్వురముకలసి యాతని రూపుమాపలేకపోవుదుమా? ఇంతకు నెవ్వఁడో విద్యావిహీనుఁ డనుకొందమన్న నట్లుకాదే మహావిద్వాంసుఁడని చెప్పితివే. ఎందులకు తనకీవిపరీతచర్య?

ఉ—అమ్మా ! క్షాత్త్రధర్మము ననుసరించి యాయన దిగ్విజయము నర్పుచున్నారు కాఁబోలును. ఆసంగతి మీ కెందులకు ? కాని ఇదివఱకే నే ననావశ్యకముగ మాటలాడి మీకు శ్రమ మిచ్చియుంటిని. ఇఁక మీరు న న్నేమియు నడుగకుఁడు. మామహారాజుసందేశమును వినుఁడు. ఆయనమాట లివి. " రాజ్ఞీవతంసమా ! ఏచిన్నదైనను మీదికూడ నొకరాజ్యము. నే నన్నిరాజ్యముల జయింపనెంచి యనేకరాజ్యముల జయించితిని. ఇప్పుడు ప్రాగ్జ్యోతిషప్రాంతమున నున్నాను. మీరాష్ట్రమునుగూడ జయింపనెంచితిని. మీరు మాయొద్దకు రానక్కఱలేదు. మే మోడిపోయితిమని మీ రనునెడల నేను మఱియొకరాజ్యముమీఁదికిఁ బోయెదను. " ఇవి వారిమాటలు. మీ రేమందురు ?

ప—ఏమిచిత్రముగనున్నది ! మే మాతనితో యుద్ధమొనర్పకుండ " నోడిపోయితి " మని యెట్లనఁగలమయ్యా ! మా కీవార్తమాత్ర మెందులకు? మ మ్మాతఁడు గెల్చెనని చాటించుకొనలేక పోయినాఁడా ?

ఉ—అతఁ డంతశౌర్యహీనుఁడా, సత్యహీనుఁడా ?

ప—శౌర్యహీనలము సత్యహీనలము మేమేనా ? ఏటిమాటలయ్యా! మ మ్మింతయగౌరవపఱచుచు రాయబార మంపునా? మేము లోకువయగు నాఁడువారమగుటచే నోడిపోయితిమని యొప్పుకొనవలసినదా ? తానే గెల్చెనని సిద్ధాంత మెక్కడిదో ? అది గాక ఆఁడుదానిని గౌరవించినవాఁడు వీరుఁడు కాని యవమానించినవాఁడు వీరుఁడా ? నే నిట్లంటినని మీ రాతనితోఁ జెప్పుఁడు.

ఉ—చిత్తము, (అని లేచుచున్నాఁడు).

ప—రవంతసేపు కూరుచుండుము. మఱి యిట్లు నామాటలుగాఁ జెప్పుము. "ఓరాజా! నీ వనినట్లు మాది చిన్నరాజ్యము. మేము శక్తిహీనలము. నామరూపము లిదివఱకు మాకు లేవు. ఇఁక ముందుకూడ రావేమో యని జడిసినాము. కాని మాపుణ్యవశమునఁ బ్రతిష్ఠాసంపాదనమునకు శాశ్వతజీవనమునకు మాకు నీగర్వాలాపములమూలమున మహావకాశము గలిగినది. మహాబలసంపన్నుఁడ వైన నిన్ను యుద్ధమున నెదిరించి మేమందఱము రూపుమాసిపోయినను మాచిన్నరాజ్యమే నీపెద్దరాజ్యముకంటెఁ బెద్దదను పేరొందఁగలదు. శక్తిహీనలమైన మేము నీకంటె శౌర్యసంపన్నత గలవారమని ప్రతిష్ఠఁ గాంచఁగలము. మాపరాజయమే మాకలంకారము. నీగెలుపే నీవంశములోఁ జెరుగనిమచ్చ. మమ్ము గెల్చి మాకుఁ బ్రతిష్ఠనీయఁ దలఁచిన నిన్ను మేము రావలదందుమా? శీఘ్రముగ సేనాసమేతుఁడవై దయచేయుము." ఉద్భటభట్టా! నీ వీమాటలాతనితోఁ జెప్పెదవు కాదా?

ఉ—చిత్తము.

ప—పెండ్లి వేడుకను నిరీక్షించినట్లాతనిరాక నిరీక్షించుచున్నామని చెప్పవలయును జుమా.

ఉ—అవశ్యము చెప్పెదను.

ప—వీరితోఁ బోరాడుట కొందులకని యాతఁడు మమ్ముపేక్షించునెడల నాతఁ డెక్కడనున్నాఁడో కనుఁగొని యక్కడకు ససైన్యముగ వచ్చి యాతనితో యుద్ధ మొనర్చి చత్తుముకాని మానఁదలఁచుకొనలేదని యాతనితోఁ జెప్పెదవుకాదా?

ఉ—తప్పకుండఁ జెప్పెదను కాని యాతఁ డట్లుపేక్షించువాఁడైన నే నిక్కడకు వచ్చుటయే తటస్థించియుండదు.

ప—మహాసంతోషము. మా రాజ్యము మీయెదికి వచ్చి మమ్ము గౌరవింపఁదలఁచుకొనినందులకుఁ జాల సంతోషించితినని చెప్పుము. కాని మోడిన ట్లొప్పుకొనుమని యాతఁ డన్నమాటమాత్రము తనకుఁ దగదు నాకుఁ దగదని చెప్పెదవుగాదా! ఆమాట శల్యమువలె నాహృదయములోఁ బొడుచుచున్నదని చెప్పవలయును జుమా! ప్రాణము 'హరి' యని విడుచులోపల మాత్రము నే నాతనిపైఁ బగఁ దీర్చుకొనకమాననని చెప్పవలయును జుమా! చెప్పవలయును జుమా!

ఉ—అలాగుననే చెప్పెదను. (తనలో) అహా! ఈమె యెంత యోధురాలో!

ప—మందాకినీ! చపలను బిలిపింపుము.

మందా—చిత్తము. ఎవరక్కడ?

[నేపథ్యమున] అమ్మా! ఏమిసెలవు?

మందా—చపల నిటకుఁ బంపుము.

ప—పండితోత్తమా! తిరుగ మీదర్శనము మా కెన్నిదినముల కగును?

ఉ—దైవసంకల్పమువలన సాధ్యమగునంతత్వరలో నే వచ్చెదను.

[చపల ప్రవేశించును]

ప—చపలా! పండితవర్యునకుఁ దాంబూలమును బన్నీటిని దెమ్ము.

చపల—చిత్తము. (నిష్క్రమించును).

ప—మందాకినీ! ఈయనకుఁ బ్రయాణము శుభముగా జరుగుటకుఁ దగినయేర్పాటుల నొనర్పుము.

మం—చిత్తము.

[చపల వన్నిటిబుద్ధితోఁ, దములపాకులపళ్ళెరముతోఁ
బ్రవేశించును].

ప—మంత్రీ! ఆయనకుఁ దాంబూలము నిమ్ము.

మం—చిత్తము. (లేచి యట్లొనర్చును).

ఉ—అమ్మా! సెలవుతీసికొందును.

ప—మంచిది. నీ వాయనతో నాలుగడుగు లేగి సెలవుపుచ్చుకొని యింటికిఁ బొమ్ము.

మందా—చిత్తము. (మందాకిని, ఉద్భటభట్టు నిష్క్రమింతురు).

ప—చపలా! స్నానపుగదిలోనికి వచ్చెదము. నీవు పోయి యన్నియు సిద్ధపఱుపుము.

చపల—చిత్తము. (నిష్క్రమించును).

ప—కాని యేది యెందులకువచ్చునో యెవ్వఁ డెఱుఁగును? వదివచ్చినను సిద్ధమే. కిరీటము తలపైఁబడినప్పుడు తల యెట్లులొగ్గితినో పిడుగుపడునప్పుడుఁగూడ నట్లే యొగ్గెదను. బదుకిచ్చువాఁడు భగవంతుఁడే. పరమపదమిచ్చువాఁడుకూడ భగవంతుఁడే. కాని యెంతదైవవిశ్వాసమున్నను రవంతయైన ప్రయత్న మావశ్యకము కాన దుర్గామందాకినులతో నాలోచించి వారి యభిప్రాయము ననుసరించి నడువవలసియున్నది.

[నేపథ్యమున] అమ్మా! దయచేయవచ్చును.

ప—ఇదుగో వచ్చుచున్నాను. (నిష్క్రమించును).

ఇది ప్రథమాంకము.



శ్రీ

# చూడామణి

## ద్వితీయాంకము.



ప్రదేశము:—ప్రాగ్జ్యోతిషప్రాంతారణ్యము- బుద్ధవిహారములో బుద్ధ విగ్రహము నెదుట.

[ప్రవేశము:— బుద్ధసన్యాసివేషముల మందాకిని, దుర్గ, చపల.]

(అందఱును గలసి పాడుచున్నారు.)

గీతము.

భక్తులార బుద్ధదేవు భజనసేయరే
పరమ శాశ్వతంబు ని-ర్వాణపదవి- నొందుటకును॥ భక్త॥
ప్రేమసుధల జగతినంత-వెల్లివిరియఁ జేసినట్టి
కోమలస్వభావునకును కోటికోటినతులొనర్చి॥ భక్త॥
జనులసోదరతను దెలిపి-జాతిభేదములను మాపి
ఘనతమించు పరమపురుషు-కాలిగోళ్ళ కనులనంటి॥ భక్త॥

[నేపథ్యమున] మంత్రీ! అడవిలో బుద్ధదేవప్రార్థనము వినఁబడు చున్నది పక్షులుపాడుచున్నవో వృక్షములే పాడుచున్నవో. ఆగానరవ మెటనుండివచ్చెనో కనఁగొనుము. అచటికిఁబోయి కృతార్థుల మగుదము.

[దామోదరగుప్తుఁడు ప్రవేశించును.]

దా—ఆమధురారవ మీవైపునుండియే వచ్చినట్లు నే ననుకొందును వినయాదిత్యమహారాజా! ఇటు దయచేయుఁడు.

[వినయాదిత్యుఁడు ప్రవేశించును.]

విన—మంత్రి దామోదరశర్మా! ఎక్కడ ఎక్కడ?

దా—ఎక్కడనో యింక స్పష్టముగఁ దెలియకున్నది.

సతిని విడిచి సుతుని విడిచి - సర్వరాష్ట్రమును త్యజించి

యతులలుంగిఁ దాల్చి ప్రేమ-మతము బోధచేసె నతఁడు! భక్తు!

జయా బుద్ధాచార్యవర్యా!

దామో & విన—జయా బుద్ధాచార్యవర్యా!

గీ. అల్లిబిల్లిగ వల్లిను । తల్లు లల్లు
కొనిన పడుగుపేకలనందు । గొందులందు
మిణుగుర్పులు దీపంబు । మెఱసి యాగు
పత్రముఁలచాటుపండుసం । పంగి వోలె.

విన—సరే, మన మాదీపమునొద్దకుఁ బోవుదము రమ్మా.

దా—మహారాజా! ఇటు. ఇటు.

విన—ఏమియుఁ దోఁపక వెన్నెలలో నాలుగడుగులు తిరుగఁదమని
పనిలేక మన మిటకు రాఁగ నెట్టిపుణ్యాత్ములదర్శనము మనకుఁ
గానున్నదో చూతం.

గీ. కార్యములు యత్నమునఁగాని । కావటంచుఁ
గొంప అందరు నా కది । సందియంబు
పట్టుదలను జేసినపని । భంగ మొందు
నిట్టుసిద్ధించు నూరక । యెపుడొ యది యెు;
భాగ్యమో భాగ్యమో యంచుఁ । బ్రాకులాడు
నంతకాలము సిద్ధింప । దది యథార్థ;
మూరక తటస్థతగ జనుఁ । డున్నయపుడె
భాగ్యదేవతనుదిటిపైఁ । బ్రజ్వలించు;
అడుగనటివానికె దాత । యధిక మిచ్చు

వేఁడుకొనువానికి విదుర్చు । విసుఁగుకొనుచు
వలదు వల దనువానికే । కలుగుచుండు
వలయు ననువాని కేడుపే । ఫలము తుదకు
కవిత గానము చిత్రిలే । ఖనము సుఖము
యశము భక్తదర్శనము భా।గ్యంబువంటి
వప్రియత్నము లైనచో । నలరు మిగుల
నటకుఁ డేడ్చినయేడ్పులో । నాడెమేమి?

మంత్రి! మనము డేరాలనువిడిచి యెంతదూరము వచ్చితిమో?

దా—అర్ధక్రోశమైన రాలేదు. సంతచప్పుడువలె నింక సేనారవ మస్పష్టముగా వినఁబడుచునే యున్నది.

[అందఱు బాడుదురు]

దుఃఖమయము దఃఖమయము- దఃఖమయము సృష్టియంచు
దుఃఖశాంతికొఱకు మనకుఁ- దోడుపడిన పుణ్యమూర్తి!భక్తు!

దా—మహారాజా! అదిగో! అక్కడ బుద్ధవిహార మున్నది. దానిలో బుద్ధసన్యాసు లున్నట్టులున్నది.

విన—సరే. నేనును జూచియుంటిని. నే నిటనుందును. నీవు ముందుగఁ బోయి నా రాకను వారికి నివేదింపుము.

దా—చిత్తము. (ముందుపోవును.)

విన—సన్యాసియాజ్ఞకొఱకిట నిలువఁబడితిని.

గీ. ఎవఁడు ప్రాపంచికసుఖంబు । నీసడించి
ముక్తివాఁ డౌనొ యాతఁడే । భూవిభుండు
పృథ్వినాథు లాతనిముందు । బిచ్చగాండ్రు
విడుపుపట్టులలో నంత । భేద ముండు
ప్రథితమూర్ధాభిషిక్తులౌ । రాజవరులు
నాయనుజ్ఞకుఁ బడిగాపుఁ । గాయుచుందు

రట్టి రాజరాజేంద్రుఁడ। నైన నేన
నధమదాసుఁడ నైతి స। న్న్యాసియెదుట.
కాగడకుఁ జెకుమకిస్ఫులిం। గమున కున్న
భేదము విభావసుసదీప్తి। విరిసిపోవు
గాత్రిశిఖరస్థుఁడగు నరు। కంటికిందఁ
బొట్టిపొడుగుల భేదవి। స్ఫూర్తి పోవు
భూరమణదాసజనమధ్య। తారతమ్య
మిట్టి నశియించు సన్న్యాసి। దృష్టియందు
నవని నేలుట కొక్క-స। న్న్యాసి తగును
గాని యాతని కద్ది య। క్క-అకు రాదు.

చప—ఇంత సేపటినుండియు మాటలాడ కక్క-డ నిలువఁబడియుం
టివి. నీ వేలవచ్చితివి?

దా—బుద్ధసన్న్యాసులకు నమస్కారములు. మీరెవ్వరు నావంక నిం
తవఱకుఁ జూచియుండనట్లు నే ననుకొనుటచేత నేమియు మనవి
చేసికొనలేదు.

చ—సరే- ఇప్పుడు చెప్పరాదా?

దా—కాశ్మీరాధిపతియైన వినయాదిత్యమహారాజు మీదర్శనమునకు
వచ్చెదనని మనవిచేయుమనినాఁడు. నే నాతనిమంత్రిని.

చ—జ్ఞానసింధూ! వినయాదిత్యమహారాజు మీదర్శన మపేక్షించు
చున్నాఁడఁట.

మందా—కాశ్మీరాధిపతి ప్రాగ్జ్యోతిషారణ్యమున నుండనేల? సన్న్యసిం
చినాఁడా యేమి?

దా—మహారాజు జైత్రయాత్రకు బయలుదేఱినాఁడు.

మందా—సరే- ఇప్పుడు మే మెందులకు? మమ్ముఁగూడఁ గొట్టునా
యేమి?

దా—మహాత్మా! అంతమాట సెలవీయఁదగునా? మీకు నమస్కరించి యాశీర్వాద మొందుటకు వచ్చును.

మందా—అటులైన రావచ్చును. ఇదేమి మా సొంతయిల్లా? మాయనుజ్ఞ యెందులకు? మే మిక్కడ నుండఁగా నెన్నిలేళ్ళాశ్రమమునకు వచ్చుచున్నవి కావు? ఎన్నిపోలుగలు నెన్నిచిలుకలు వచ్చుచున్నవి కావు? వాని కెవరు సెలవిచ్చినారు? ఒకరు సెల వీయనక్కఱలేదయ్యా! మే మిక్కడ బుద్ధదేవుని ధ్యానించుచున్నాము సర్వప్రాణిశోకము నిచ్చుటకు వచ్చి స్వేచ్ఛగా వినవచ్చును. మాతోఁగూడఁ బ్రార్థింపవచ్చును. మాకిక్కడఁ గాంతలా? అంతఃపురములా? మడుకగములా? ఎవ్వరువచ్చుటకు సందేహింపవలసిన పని యేమున్నది?

దా—మహాత్మా! పెద్దలదర్శనమునకై వచ్చునప్పుడు ముందుగ రవంతవార్త నంపుట యాచారము కావున—

దుర్గ—మాటకుమాట యటు తేల పెంచెదవయ్యా? పోయి మీరాజును దీసికొనిరమ్ము.

(దామోదరశర్మ పరిక్రమించును)

మందా—మీరెవ్వరు తెలియగ మాటలాడకుఁడు. మీమాటలకు నామాటలకు వ్యత్యాస మున్నయెడలఁ బట్టుపడిపోవుదుము. నేను జ్ఞానసింధుఁడను. చపలా! నీపేరు బుద్ధదాసుఁడు దుర్గా! నీపేరు నీతినిధి. మఱచిపోకుఁడు.

[దామోదరశర్మ వినయాదిత్యునితో నాశ్రమమునకు వచ్చును]

చప—(తనలో) ఆహా! ఏమి తేజము—మనసునో మెఱుపుమెఱసిన ట్లున్నదే!

విన—మహాత్ములారా! నమస్కారము.

మందా—మాకు నమస్కరించుట కాదయ్యా! అదిగో ముం దట్లుపో యి బుద్ధదేవునకు నమస్కరింపుము.

విన—బుద్ధదేవా! నమస్తే.

మందా, దుర్గ, చవ—బుద్ధదేవునకు జయా! బుద్ధదేవునకు జయా!

మందా—రాజా! కూరుచుండుము. మంత్రీ! నీవుకూడఁ గూరుచుం డుము.

(అట్లు కూరుచుందురు.)

విన—మహాత్ములారా! మిమ్ము దర్శించి కృతార్థుఁడ నైతిని.

ఆ. వె. కమ్ముకొంటఁ్దుష్ట । గంధవాహాని పీల్చి
నాతఁ డబ్ధితీర । మందినట్లు,
కుటిలభవమునందు । గుడుగుడుగుంచము
లాడు నేను మిమ్ము । నలరఁ గంటి;
కంటిగ్రంతతోడ । గానుగె ద్దట్టులు
పరిబలరాజ్యతంత్ర । బంధ మొంది
తిరుగుచుంటి నొక్క । తీరుగా విశ్రాంతి
ముదము గనక పుణ్య । మూర్తులార!

మందా—మహారాజా! ఇప్పుడు జైత్రయాత్ర బయలుదేఱితివఁటే?

విన—చిత్తము.

మం—ఇక్కడనుండి మఱి యేరాజ్యమునకుఁ బోవుదువు?

విన—స్త్రీరాజ్యమునకుఁ బోవలయు నని వెళ్లుచు సైన్యముతో సమీ పముననే విడిసితిని.

మం—బుద్ధదాసా! స్త్రీరాజ్య మిక్కడ కెంతదూరమయ్యా?

చ—దండెత్తు సైన్యమునకుఁ బండ్రెండుక్రోశములు. పాఱిపోవు సైన్య మునకు ముప్పదిక్రోశములు.

దు—ఇరువదిక్రోశములకంటె హెచ్చుదూరము లేదు.

మం—మహారాజా ! నీసేన గొప్పది కాఁబోలు నేమి ?

విన—ఎనుబదివేల కాల్బలము ఇరువదివేల యశ్వబలము మాత్రమే యిప్పటి కున్నవి.

మం—స్త్రీరాజ్యమున కేమాత్రము సైన్య మున్నదో ?

విన—పదివేలకుఁ దక్కువగా నుండు నని వింటిని.

మం—మొదలే స్త్రీలు కదా. అందుపై నల్పసైన్యవతులు కదా. నీవు వారిపై దాడి వెడలనేల ?

దు—తగినబల మున్నది కావున బయలుదేఱినాఁడు.

విన—అట్లు కాదయ్యా—మా తాతగా రగు లలితాదిత్యుఁడు స్త్రీరాజ్యమును దన జైత్రయాత్రలో గెలిచినాఁడు ఆయాచారము నే నేల మానవలయు నని.—

చప—(నవ్వుచున్నది )

దు—ఏమి బుద్ధదాసా ! నవ్వుచున్నావు ?

చప—నీతినిధీ ! నా కొక్కసందేహము తోఁచినది.

గీ. తాత సత్రంబు గట్టింపఁ । దానుగూడ
సత్రనిర్మాణ మొనరింపఁ । జనును గాని,
తాత యెవనినో గొట్టుఁగఁ । దానుగూడ
నతనిమనుమని గొట్టుట । యర్హ మగునె ?
తాత సత్కవికృతు లందఁ । దానుగూడ
సత్కవులచేతఁ గృతు లందఁ । జనును గాని,
తాత చెడఁద్రాగి నడువీథిఁ । దాండవింప
దానుగూడను ద్రాగుట । తప్ప దొక్కొ ?.

దు—బుద్ధదాసా ! రాజులకు జైత్రయాత్ర తప్పుపనులలోనిది కాదు లే—నీ వట్లనఁగూడదు.

విన—బుద్ధదాసా ! నా జైత్రయాత్ర నిట్లధిక్షేపించుట తగునా ?

మందా—మహారాజా ! నీ వేమియు ననుకొనకుము. ప్రపంచము వదలిన మాకు మీచర్య లన్నియు వెఱ్ఱిగాఁ దోఁపక మానవు. మాచర్యలు నీకుఁగూడ నట్లే యుండవచ్చును. మీకు మాకు దృష్టిపథములే వేఱు. మీజైత్రయాత్ర యధిక్షేపణార్హామేల కాదో నేను గొంతసేపటిలోఁ జెప్పెదను. మీతాత చేసిన మహాకార్యములు నీకంటె నా కెక్కువ తెలియవు కాని చెప్పెదను. ముక్తకేశవస్వామి యనుపేర స్వర్ణవిష్ణువిగ్రహమును స్థాపించినాఁడు గోవర్ధనుఁ డనుపేర నొక రజతవిష్ణువిగ్రహమును బ్రతిష్ఠించినాఁడు. ఏఁబదినాల్గుహస్తములుగల ఏకశిలాస్తంభమును స్థాపించినాఁడు. పెద్ద చతుశ్శాలయు గొప్ప జినవిగ్రహమును గల రాజవిహార మను నొక్క మహాపట్టనమును నిర్మించినాఁడు. ఎనుబదినాల్గు వేలతులముల బంగారుతో ముక్తకేశవస్వామి విగ్రహమును, నెనుబదినాల్గు వేల రజతముతోఁ బరిహాసకేశవస్వామి విగ్రహమును, నెనుబదినాల్గు వేల ప్రస్థముల యిత్తడితో మిన్నంటు బుద్ధవిగ్రహమును స్థాపించినాఁడు. ఈపనులలో నీవు దేని ననుకరించితివి? బుద్ధమతాభిమానములో నీతాతకంటె నీ వధికుఁడవు కదా, బంగారు వలదు, ఇత్తడి వలదు, పాషాణముతోఁ బదియంగుళముల బుద్ధవిగ్రహమునైన నీవు నిర్మింపఁగలిగితివా?

విన—లేదని చెప్పుటకు నేను లజ్జపడుచున్నాను. కాని ప్రయాగలో లక్ష కొక్కటి తక్కువయగు నశ్వములను దానమొసఁగి, లక్షగజ్జములను దానమొసఁగినవాఁడు నాకంటె ఘనుఁడని గంగలో శిలాశాసనము చేయించితిని.

మందా—వినయాదిత్యా! నీవు యోగ్యుఁడవు కావని, దాతవు కావని, బుద్ధమతాభిమానివి కావని నే నంటినఁటయ్యా? శాశ్వతములైన

విగ్రహవిహారనిర్మాణములను నీ వుపేక్షించి యశాశ్వతమైన జైత్రయాత్రకు బయలుదేఱితివి. నీతాత గెలిచిన రాజులను దిరిగి నీవు గెలువవలసివచ్చినదా లేదా? నీతాత జయమెంత యశాశ్వతమో నీజయముకూడ నంతయే యశాశ్వతము కాదా? ముందు జైత్రయాత్రాకార్య మేల యారంభించితి వో యూ నాయనా?

చపల—ఒడలశక్తి యున్నది. చేత సైన్య మున్నది. సులభముగా నితరులను జావఁగొట్టవచ్చును గదా యని—

మందా—బుద్ధదాసా! నీ పూరకుంకుము

విన—ముందు జైత్రయాత్రలో ధనసంపాదన మొనర్చి తరువాత మహాకార్యములను జేయవచ్చునని యెంచి దీనిని దలపెట్టితిని.

మందా—నీవు ప్రయత్నించి ధనము సేకరించి మహాకార్యములు చేయుటకు బ్రదుకుదువని యేమినమ్మకము? జైత్రయాత్రలోనచ్చు రాజులకపాయము నీకవలెనె నెల్లప్పుడుఁగూడఁ దిరుగుచునేయుండను గాదా? నీప్రజల యదృష్టమున బ్రదికితివి కాని యన్యథా జరుగవలసినదేనా? ధనముకొఱకు నీవు దండయాత్రలకు బయలుదేఱితివని నేను నమ్మను. నీతాతగారొనర్చిన మతవిషయకమహాకార్యముల ననుకరించుటకు నీరాజ్యములోని ధనమే నీకుఁ జాలును. నాయనా! సత్కార్యరచన యెప్పటికో యట్టిపెట్టి యుంచెదరా? ఎప్పటికో కాదు నేపటికి—నీ విచ్చట—ఈస్వేచ్ఛతో, ఈబుద్ధితో—ఈనిరుపద్రవతతో నుందువని చెప్పఁగలవా? రాజేంద్రా! నీవు నీమంత్రివంకఁ జూచుచున్నా వెందులకు? ఆలస్య మయినది కావున శిబిరమునకుఁ బోవ నెంచుచున్నావా? సంతోషమే దయచేయుఁడు

విన—మహాత్మా! నాయభిప్రాయ మది కాదు. మంత్రీ! చంద్రాస్త మయము కావచ్చినది. ఈయడవిలోఁ జీఁకటిని నీ వొక్కఁడవు పోలేవు కావున నిప్పుడే పొమ్ము. నీవు లేకుండ సైన్య మచ్చట నుండఁ దగదు.

దా—మీారుగూడ దయచేయరా?

విన—దొరకక దొరకక పుణ్యమూర్తులసన్నిధి సంభవించినది. నేను • రాను ఎన్నిగో సందేహములు వీరివలనఁ దెలిసికొనవలసి యున్నవి నే నీరాత్రి రాను. ఉదయమున నీవు నాకొఱకు రా వలయును.

దా— మీారొక్కరు నిట నుండఁ దగదు.

విన—త్రిపీఠకమువలెఁ బ్రకాశించు ముగ్గురుమూర్తులసన్నిధి నుం దును. నా కొంటరితన మేమున్నది.

దా—నేను పోయి కాగడాల నిచ్చి కొందఱభటులను బంపుదును.

మందా—మహారాజా! మీామంత్రి చెప్పినమాట బాగుగా నున్నది. కొందఱభటుల నిక్కడకుఁ బంపుట కంగీకరింపవలయును.

విన— భటులు నారక్షకొఱకా?

మందా—సర్వప్రజారక్షకుఁడవైన నీకొకరిరక్షలోఁ బని యేమున్నది? భటులు కొందఱుగూడ నుండుట రాజమర్యాద. దాని నతి క్రమించు టేల?

విన— మా రాజత్వము, మా రాజమర్యాదలు, మాభటపరివేష్టనము లు, మా శిబిరములలో, మాకోటలలోఁ గాని మహానుభా వుల పవిత్రవిహారములందుఁ గూడ నా? తప్పు కాదా? ఇచ్చ టమేమే మీాభటులము.

మందా—నీతినిధీ! ఏమి దొడ్డమహారాజోయి! వినయాదిత్యుఁ డను పే రికిఁ దగుదువయ్యా.

దా—అట్లైన నేను బోవలసినదేనా?

విన—అవశ్యము నీవు నాకొఱ కెవరినిగూడఁ బంపవలదు. మంత్రీ!
నీవు నారక్షకొఱ కాందోళన పడుచున్నావు కాఁబోలును.
లోకరక్షకుఁడగు బుద్ధదేవుఁ డదిగో—ఆతఁడే రక్షకుఁడు.

మం నా—
దుర్గ—
చప—
} జయా! బుద్ధదేవా! జయా! బుద్ధదేవా!

దా—మహారాజా! నమస్కారము మహాత్ములారా! నమస్కారము.
కోటిప్రాణము లీమహారాజప్రాణములో నిమిడియున్నవి. కని
పెట్టి యుండుఁడు

విన—మంత్రీ! నీ కేటివెఱ్ఱి—మా పుణ్యప్రసంగమున కడ్డురాక యుండఁ
బొమ్ము ఈయొక్క రాత్రియైన నే నీసన్యాసులలోఁ దాత్కా
లికసన్యాసినై బుద్ధదేవప్రార్థన మొనర్చుచు సత్కాలక్షేప
మొనర్తును. పుట్టినది మొదలు చచ్చువఱకు నొక్కటే రాజ
కీయాందోళనమా? ఒక్కటే ధనసంపాదనప్రయత్నమా?
ఒక్కటే యధికారార్జనాభిసంధియా? ఒక్క రాత్రియైన నేను
వాని నన్నిటిని మఱువఁదగదా? తిరిగి తెల్లవాఱదా? తిరిగి కా
డికిఁక్రింద మెడ దూర్చ కూరకుందునా? తిరిగి మీరు 'చో, చో'
యని పొడిచి నన్ను నడపింపకుందురా? ఈరాత్రికి నన్ను
వదలిపెట్టుము. ఈరాత్రి నేను కాశ్మీరాధిపతిని గానని యను
కొమ్ము. పొమ్ము

దా—చిత్తము. (నిష్క్రమించును)

దుర్గ—(తనలో) ఆహా! ఒక్కఁ డున్నాఁడు. రైజారుతో నొక్కపో
టు పొడిచి యీతని నంత మొందింపఁదగినది. ఈతనితో మా
రాష్ట్రమునకు సర్వభయనాశన మగును కాని యీతని గ్రి

హించి తీసికొని రావలసిన దని రాణిగారి యాజ్ఞ యగుటచేత కైదారుములలోనే యుండవలసివచ్చినది. ఈతఁడు ప్రాణములతోనే యుండవలసివచ్చినది. మే మింక భయముతోడనే యుండవలసివచ్చినది. ఇట్లైన నీతని బట్టుటకు మాబలాత్కారమున నొప్పుకొనినది కాని యామె కింతమాత్ర మిష్టము లేదు, మోసము వల దని త్రోచివైచినయెడల రాజకార్య మగునా?

విన—మహాత్మా! జ్ఞానసింధూ! బుద్ధమతసారమంత నాల్గుమాటలలోఁ జెప్పఁగలరా?

మందా—భవము సర్వదుఃఖపూర్ణము. అట్టి దుఃఖమునకుఁ దృష్ణయే మూలకారణము. తృష్ణానిర్మూలమైన దుఃఖనిర్మూల మగును. అష్టాంగశీలాదులవలనఁ దృష్ణనిర్మూలన మగును.

దుర్గ—(అపవారించి) మంత్రీ! లేనిపోనిమాటలు పెంచవలదు. శీఘ్రముగఁ దెమల్పవలయును. ఈతని మంత్రి యెవ్వరినైనఁ బంపునేమో యని సందేహమున్నది.

మందా—మఱేమియు భయము లేదు. ఈతనిమంత్రి పంపునెడలఁ బదిమందిని బంపును. ఇరువదిమందిని బంపును. ఈమామిడితోపుప్రక్కనే మనకు నూర్గురుభటు లుండ మన కేమిభయము?

దుర్గ—(అప) అంతవఱకుమాత్రిను రానిచ్చు టెందులకు?

మందా—(అప) నే నెఱుఁగుదును. చూచితివా? మన మేమో యాలోచించుకొనుచున్నామని మహారాజప్పుడే సందేహపడుచున్నట్లున్నాఁడు. (నవ్వుచు) మహారాజా! ఏమి యాలోచించుచున్నావు?

విన—మీ రేదో యోజించుచున్నారని నే నూరకొంటిని.

మందా — మహారాజా! మా కేమి యోజన లుండును! ధనము సంపాదింపవలయుననియా? రాష్ట్రము సంపాదింపవలయుననియా? కాంతను సంపాదింపవలయుననియా? కీర్తిని సంపాదింపవలయుననియా? ఒక్క నిర్వాణచింత తక్క మఱియేచింతయు మాకు లేదయ్యా. ఏదియో రావలయునను దేవులాట మాకెన్నఁడు లేదు. ఉన్న దేదో పోయినదాఁక మా కొక్కటే తహతహ. మహారాజా! మఱి యేదైన ప్రశ్న మడుగుదువా?

వి — జ్ఞానసింధూ! యుద్ధమునుగూర్చి బుద్ధదేవుని యభిప్రాయమేమి?

మందా — క. "ఒకలు విజయముఁ జయము । దొసలఁ గయ్య
మునకుఁ బనిలేక కాల్దువ్వఁ । జనదు గాని
యన్నివిధముల పోరాట । మాఁగనప్పు
డాత్మరక్షకై తగునంతె । యత్నముయ్య."

అని బుద్ధదేవుఁ డానతిచ్చినాఁడు.

విన — కావున జైత్రయాత్ర నిషిద్ధ మన్నమాట.

మందా — నాయనా! అహింసయే ప్రప్రధానమైనమతమునందు జైత్రయాత్ర నిషిద్ధ మనుమాట వేఱె చెప్పవలయునా? జైత్రయాత్ర నిషేధించినంతమాత్రమున నీ కెంతయో యిబ్బందిగా నున్నట్లగపడుచున్నదికదా మా బ్రతు కెంతకష్టభూయిష్ఠమో నీ వాలోచించుకొంటివా?

క. "తీఁగపైఁ గాంచుఫలములఁ । ద్రెంపుకొంటెఁ
దనదుకను లూడదీసికోఁ । దగను యతికి;
ధరణిలో నుండు మూలముల్ । త్రవ్వుకొంటెఁ
దనదు నెముకలు పెటికికోఁ । దగదు యతికి."

అని మమ్ముఁగూర్చి బుద్ధదేవుఁడు బోధించినాఁడు. ఇంతయడవి యున్న దా ? ఒక్కచెంచు మేము కోసి తినఁదగదు. ఎవఁడైన నీయవ లయును. అప్పుడు తినవలయును. అడవిలో మా కిచ్చువాఁ డెవ్వఁడుండును? ఏగోరువంకయో, యేచిలుకయో కొట్టి ప్రమాదమునఁ గ్రిందఁ బడవైచిన కాయలనో గాలి రాల్చివైచి న యాకులనో దిని బ్రదుకుచున్నాము. బొమ్మ జెముడుచెండు దినుటలోఁ గాకకున్న స్వతంత్రత మనుష్యులమైన మాకు లే దు. ఎందు కింతపడుచున్నాము. సన్యాసము నిర్వాణమునకు దగ్గఱదారి యని యామహాత్ముఁ డానతిచ్చినాఁడు.

విన—ఆహాహా! మీ కీచిన్నతనములో నెంత వైరాగ్యము కలిగినది!

మందా—మేము చిన్నవారమే యగుదుము. మాయందఱిలోను మిగులఁ జిన్నవాఁ డీబుద్ధదాసుఁడు.

చరు—(తనలో) నిజమే. వదునాలేండ్లదావను. కన్నెటికమైనఁ గాలేదు.

విన—మీ కిద్దఱికిఁగూడఁ బెండ్లి కాలేదా ?

మందా—లేదు. మా కీచిన్నతనములో నింతవైరాగ్య మెట్లు కలిగినద ని నీ వాశ్చర్య మొందుచున్నావు. చిన్నతనమే వైరాగ్యమున కుఁ దగినకాలము. ఎదిగినకొలఁది వృద్ధియగునది వైరాగ్యము కాదు. లాంపట్యము.

ఆ. వె. అగ్ని రాజుచుండ ! నట్టె యార్పఁగవచ్చు
నాశె లంటుకుంట ! లార్పఁ దరమె ?
పుట్టిటిబిడ్డవాలు ! తిర మట్టె సరిచేయ
వచ్చు ముదురుతలకు ! వంక చెడునె
బ్రహ్మపుత్ర నడ్డు ! వఱువంగవలె నన్నఁ
బుట్టుచోట దానిఁ ! గట్టవలయు,

నంతేకాని నడుమ । నష్టకట్టను గట్ట
కట్ట తెగును నదికి । గతియు హెచ్చు.
అనుభవించుకొలఁది । నత్యాశయే కాని
సంతతమైన మదికి । శాంతి లేదు
గాన ననుభవంబు । గలుగకపూర్వమే
భవమునుండి వెలికిఁ । బడుట సులువు.

విన—సులువని మీరు సులభముగాఁ జెప్పుచున్నారు కాని యబ్బా! ప్రపంచత్యాగముకంటెఁ గష్టము వేఱొకటి లేదు. కాని మీ రొనర్చినవారు కావున మీకు సులువుగా నున్నది. ఎప్పుడో కాని మీకు భోజనమే దొరకదు కదా. మీ రిట్లు పుష్టిగ నున్నా రెందుచేత? వికసించినపద్మములవలె నిండుగఁ, గంటి కింపుగఁ, జిత్తమున కాహ్లాదకరముగ నున్నారే?

మంచా—నాయనా! తపస్తేజ మనఁగ నదియే.

ఆ వె. అశననియమ మున్న । యతనికిఁ గాయస్థ
దోషసమితి యంత । తొలఁగిపోవ
స్ఫటికతుల్యమైన । శాశ్వతదేహంబు
నిల్చి వెలుఁగుచుండు । నిర్మలముగ.

గీ. పుటము లొందినబంగారు । పోలుపుఁగాంచు
సానబట్టిన హీరము । శస్త్రమగును
బులుగడిగినట్టి ముత్యంబు । వెలయు మిగుల
మనుజుఁ డుపవాసదీక్షచే । మహిమఁ గాంచు
నిండుకడుపున గుఱకతో । నిద్ర పొంగ
మండుకడుపున బుద్ధనామంబు వెలుఁగు
నీటితో నున్నకలశంబు । నీట మునుఁగు
గాలిమాత్రమే కలయది । తేలియాడు.

దుర్గ—జ్ఞానసింధూ ! మనకు బుద్ధదేవప్రార్థన మాలస్య మగు
చున్నది.

మందా—నీతినిధీ ! నిజమే మహారాజా ! బుద్ధదేవుని బ్రార్థింతమా?

విన—అవశ్యము మీతో బుద్ధదేవప్రార్థన మొనర్చుటకేకదా యిక్క
డ నిల్చితిని.

మందా—అటులైన నదిగో యావసారాలో నీరున్నది పాదప్రక్షాళన
మొనర్చుకొని రమ్ము.

(వినయాదిత్యుఁ డట్లుచేసి వచ్చును.)

బుద్ధదాసా! బుద్ధదేవుని కెడమవైపునఁ గలశములోఁ దీర్థ
మున్నది. ఆకలశ మిటుకుఁ దెమ్ము. (చపల తెచ్చియిచ్చును.)
వినయాదిత్యా! ఇదిగో యీబుద్ధాభిషేకతీర్థమును బుద్ధదే
వుని దలఁచకొని త్రాగుము. (కలశ మిచ్చును.)

విన—(త్రాగి కొంత వెగటునటించి) మహాత్మా! మతేమియు లేదు.
అడవినీ రగుటచే వెగటుగ నున్నది. కృతార్థుఁడ నైతిని.

మందా—రెమ్ము దేవుని బ్రార్థింతము.

గీతిక.

భక్తులార బుద్ధదేవు-భజనసేయరే
పరమశాశ్వతంబు ని-ర్వాణపదవి నొందుటకును॥ భక్తు॥
మంచిదృష్టి మంచియూహ - మంచివాణి మంచిపనియు
మంచిదైన యోనిమిదియున-నుంచితముగ గలుగునట్లు॥ భక్తు॥
పరమపురుషు భక్తపాప-భంజన ప్రశస్తబోధు
పరమశాంతియుతమనస్కు-భవ్యచరితు దేవదేవు॥ భక్తు॥

విన—(అటు నిటుఁదూలుచు పాడుచున్నాఁడు)

మందా—మహారాజా ! తూలుచున్నావు. బింకముగ నిలువఁబడుము.

విన—తల తిరుగుచున్నది.

మందా—మహారాజా! ఎంతయదృష్టవంతుఁడవయ్యా! రవంతిసే పటిలో నెంతభక్త్యావేశ మొందితివయ్యా! సంతతము ధ్యానించు మాకు నీయావేశములో సహస్రాంశమైన నెన్నఁడు సిద్ధింపలేదయ్యా! నీ దెంతపుణ్యజన్మమయ్యా! బుద్ధదేవునికి నీయం దెంతవాత్సల్యమయ్యా!

విన—ఇది-ఇది- నిజముగా భక్తి-భక్తి-వలన కలిగినదేనా-నేను-నేను దాగినదానిలో మత్తు-మత్తు ఏమియు లేదు-లేదు గదా-తీర్థము రవంత వెగటు-వెగటు— (తూలుచున్నాఁడు.)

మందా—బుద్ధదాసా! తూలుచున్నాఁడు. క్రిందఁ బడకుండఁ బట్టుకొనుము.

చప—(దగ్గఱఁదీసి పట్టుకొనును.)

విన—నీవు-నా-నా-భార్యవైన-క-కల్యాణి వేనా! నా-నా-నాకు సన్యాసులు విషము-విషము-పెట్టి-మంతి-మంతి—

(మూర్ఛాపన్నుఁ డగును.)

దుర్గ—ఇతని కింతలో మత్తు తల కెక్కినది. ఈమత్తులోఁ గూడ నాఁడుదానిస్పర్శ మిట్టె గ్రహించినాఁడు.

చపల—(తనలో) ఇతనితలకు మత్తెక్కుట కేమి గాని నాయొడలా పాదమస్తకము జలజల లాడుచున్నది. కాశ్మీరదేశాధిపతి నా భుజముపైఁ దల మోపి మూర్ఛావశుఁ డయ్యెను. మత్తుత్రాగుటవలన నాతనికి పారవశ్యము మగవాని తాఁకుటవలన నాకుఁ బారవశ్యము. ఆహా! ఇది యేమి—ఈయనుభవ మనిర్వాచ్యమగుచున్నదే.

ఆ. వె. మనసు కరిగి కరఁగి తనలీన మయ్యెనో
దేహ ముబికి యుబికి తేలి కగుచు

మనసుతోడఁ బైకి । మాయమై పోయెనో
చిన్నదాన నేమి । చెప్పఁగలను.

(రాజును గద్దెపైఁ బండుకొనఁజేయును.)

దుర్గ—ఆహా ! ఎంతదృఢశరీరుఁ డెంతశీఘ్రముగఁ బారవశ్య మొందెనో ?

మందా—దుర్గా !

గీ. శక్తిహీనుని కబలపై । సందియంబు
కుటిలవిభునకుఁ బ్రజలపైఁ । గొండెములును
మహితబలునకుఁ గర్వసామగ్రిమత్తు
త్వరగఁ దల కెక్కు మఱియు నెంతటికి దిగవు.

గీ. సర్పముఖజంతువిషము దోషజ్వరంబు
వివిధసాంక్రామికామయ । వితతి మఱియు
మదపదార్థంబు దిక్కు సమ్యగ్బలాఢ్యుఁ
ద్వరగ వేధించు దుర్బల । నరునికంటె.

కావలసినపని యేదియో కొంత యైనది. ఇఁక నాలస్యము జేయఁదగదు. చపలా ! ఈలతో సంజ్ఞ చేయుము.

చ—(ఈల యూఁదును.)

[ఇద్దఱుభటులు ప్రవేశింతురు.]

మందా—ఏమిరా! గుఱ్ఱములు బండ్లకు సిద్ధముగఁ బూన్చియున్నవా?

భటులు—చిత్తము.

మందా—మీ రీతనిని భద్రముగఁ దీసికొనిపోయి బండిలో నుంపుఁడు. మేముకూడ వచ్చుచున్నాము.

భటులు—చిత్తము. (వారు రాజు నెత్తుకొనిపోవుదురు.)

మందా—ఆహా ! రా జెంతవ్యర్థుఁ డైయున్నాఁడో.

గీ. పడుగలకు నశ్వమా గాత్రి । బలము కలదు
ప్రాణికోట్లను రక్షించు । ప్రాణ ముండు
నేది యెటు లుండినను లాభ । మేమి కలుగు
నుండవలసిన మతి చెడి । యుండునపుడు ;
ఒక్కశంకు వో తిరుగుడో । యూడిపోవ
నీటియంత్రము తిరుగక । నిల్చిపోవు
నొక్కమెట్టో తీగయొ జాఱి । యుండునపుడు
మోతకే కాని వీణియ । మోదిత కగునె?
ఎన్నికోర్కులు తంత్రంబు । లెన్ని యెన్ని
యెన్ని పన్నాగములు మన । సున్న వేళ
నది రవంత స్తంభింపఁగ । నన్ని బందు;
అఖిలసృష్టికి కారణ । మగును మనసె

దుర్గ—మన మింకఁ ద్వరగఁ బోవుదము రండు. ఇఁక ముం దేమిఁ జరుగునో పరమాత్మునకే యెఱుక.

చక—(తనలో) ఏమున్నది? నే నీమహారాజు చేతఁ గన్న చెఱఁ దీర్పించుకొనుటకుఁ బ్రియత్నింతును. ఇంకచక్రవర్తి మాకోటలో నున్నప్పుడే నా కీయుపకారము జరుగనియెడల మఱెప్పుడు జరుగును ?

దుర్గ—మనమే యీమాయాకృత్య మొనర్చితి మని త్రిపురాత్రి మన కోటఁ గాశ్మీరసేనాధిపతి ముట్టడించును.

మందా—నా కది నమ్మకము లేదు. (ముగ్గురు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.



శ్రీ

# చూడామణి

## తృతీయాంకము.



ప్రదేశము:—కోటలో భాగము.

[ప్రవేశము:—కారాగృహమున వినయాదిత్యుఁడు; చపల స్త్రీరూపమున]

చ—చూచినతోడనే బుద్ధిపుట్టినట్లే, బుద్ధిపుట్టినవెంటనే ప్రయత్నించినట్లే, ప్రయత్నించువెంటనే ఫలము కలుగునెడల నాహా! ఇంకఁ గావలసిన దేమి? నాయత్న మేమగునో యని గుండె కొట్టుకొనుచున్నది. ఈసంగతి రాణిగారికిఁ దెలియునేమో యని మఱింతఁ గొట్టుకొనుచున్నది. ఆతనిపై ననురాగమున నంతకంటెఁ గొట్టుకొనుచున్నది సందేహమును భయమును మించిపోయినరాగము నన్నిటకు వెడఁబెట్టి గెంటుచుండ నే నేమి చేయఁగలను? మహారాజు నిరసించిన సరే-రాణిగారు నన్ను హింసించినసరే, నేను నాప్రియునిజూచి మాటలాడకమానను. బుద్ధాశ్రమమున నాతని గౌఁగిలించినప్పు డది మూర్ఛయా, స్వర్గమా? వెఱ్ఱియా, మాయయా? యేమియో యిప్పటికిని దెలిసినది కాదుకదా! అటుపైని మఱియొకమాఱట్టియనుభవముఁ గలిగినపిమ్మట ప్రాణ మెగిరిపోయిన సరే; ప్రపంచము భస్మమైన సరే.

విన—(లోనుండి) బుద్ధదేవా ! బుద్ధదేవా ! బుద్ధదేవా !

చప—ఇంకను బుద్ధాశ్రమమందున్నట్లు భ్రమించుచున్నాఁడా యేమి? కాదనుకొందును. ఇంకేమిపలుకునోకూడ వినవలయును.

విన—తిరుగఁ గారాబంధమా ? బుద్ధసన్యాసులమూలముననే కారాబంధమా ? బుద్ధప్రార్థనమందే కారాబంధమా ? బుద్ధతీర్థపానముననే కారాబంధమా ? దయ లేదా మహాత్మా! నిన్ను భక్తితో సేవించుచున్న నన్నె యిట్లుచేసెదవా? నే నెట్లువిడుదల యగుదును? నే నెచ్చట బంధింపఁబడియుంటినో నేనే యెఱుఁగనప్పుడు నామంత్రు లెట్లెఱుఁగఁగలరు ? కావున విముక్తి కవకాశ మేదియుఁ గానఁబడదు. నాసేవకు నే నెంతదూరమునను టినో—మంత్రు లేప్రయత్నమున నున్నారో—ఏమియుఁ దెలియదు. కళ్యాణీ! ప్రాణప్రియా ! నీదర్శనము నా కీజన్మమునఁ దిరుగఁ గలుగునా ?

(చపల ముందునకు వచ్చును.)

చ—మహారాజా ! నమస్కారము.

విన—(తేఱిపాఱఁజూచి యూరకుండును.)

చ—మహారాజా ! మఱియొక నమస్కారము.

విన—దీర్ఘాయుష్మతివి కమ్ము ! కాని నేను మహారాజనవి నీ వెట్లెఱుఁగుదువు ?

చ—నేను మిమ్మొకసారి చూచియుంటిని.

విన—ఆలాగా ! ఔనుసుమా ! ఇదేరంగు- ఇదేపొడుగు- ఇదేవయస్సు —ఔను జ్ఞప్తికి వచ్చుచున్నది. ఇదేముఖవైఖరి—ఇదే కంఠధ్వని—చూడ నిన్నుఁగూడ నేను జూచినట్లున్నది.

చ—చూచినారు. మి మ్మిక్కడకుఁ దెచ్చిన బుద్ధసన్యాసులలో నేను గూడ నుంటిని.

విన—ఆఁ, ఆఁ, ఆ! (సందేహించుచు) ఆఁడుదానవై వెనుక బుద్ధసన్యాసివేషము వైచితివా? వెనుక బుద్ధసన్యాసివై యిప్పుడాఁడువేసము వేసితివా?

చ—ఆఁడు దేకారణముననైన బుద్ధసన్యాసివేషము వేసియుండవచ్చును గాని యున్నియు వదలుకొనిన బుద్ధసన్యాసి యాఁడువేసమేల స్వీకరించునయ్యా!

విన—నన్ను బుద్ధదేవుఁడు క్షమించును గాక! నాకు బుద్ధసన్యాసులందు విశ్వాసము తగ్గినది.

చ—అటులైన నేను మగవాఁడనై స్త్రీవేషధారణ మొనర్చితిననియే మీ సందేహమా? అట్లు తలవంచుకొని మాటలాడుదు రేల? నావంక బాగుగఁ జూడుఁడు. నేను శైలూషకాంతనో, జన్మకాంతనో మీరు గ్రహింపనేలేరా? సారంగసన్నిభములై సహజములైన యీముంగురులు మగవాఁడు నాటకములో నెత్తిని గట్టుకొన్న సవరమువలె నున్నవా? నాముఖమందుఁ గల సహజలావణ్యము రంగులో నైగనిగ్యము జీవకళలో స్త్రీత్వసంస్కారము మోటమొగముగల మగముండకొడుకు హరితాళపుఁబూఁతచేత నభ్రకపుడాకుచేతఁ గలిగించుకొనినవే యని మీరు భ్రమపడుటకంటె వింత యున్నదా?

(గుండెలపైఁ జేయివైచుకొనును)

విన—ఇఁకఁ జాలు. ఇఁకఁ జాలు. నీవు యథార్థముగఁ గాంతవే మైయుండవచ్చును. ఈతత్త్వపరీక్ష నాకిప్పు డక్కఱలేదు. నేను కొన్నిసంగతు లడిగెదను. నీవు దయయుంచి చెప్పఁగలవా?

చ—అడుగుఁడు.

విన—నీతో వచ్చిన బుద్ధసన్యాసు లిద్ద ఱెవరు?

చ—మంత్రి యొకతె. సేనాధినాయిక యొకతె.

విన—ఇది స్త్రీరాజ్యమా ?

చ—ఔను.

విన—నీ వెవ తెవు ?

చ—నేను పద్మావతిరాజ్ఞీమణి దాసిని. నీటిలో మత్తుపదార్థమును గలిపి మీంచేఁ దాగింది బండిపై మి మ్మిటకుఁ దెచ్చి కారలో నుంచితిమి.

విన—అది చెప్పనక్కఱలేదు కాని న న్నీ కారలో నెంతకాల ముంతు రో యెఱుఁగుదువా ?

చ—విడుదల యగువఱకు.

విన—విడుదల యెప్పు డగును ?

చ—మంచిదినములు వచ్చినప్పుడు.

విన—అవి యెప్పుడు వచ్చునో ?

చ—నేను జ్యోతిష మెఱుఁగనయ్యా!

విన—జ్యోతిష మక్కఱలేదు. మీరాణిగారితో నీవు చనవుగా నుందువు కదా ; ఆమెయభిప్రాయము నీకుఁ గానంతయైనఁ దెలియకుండునా ?

చ—మారాణిగా రెవ్వరికిఁగూడఁ జన వీయదు. ఆమెవంటిస్త్రీ లోకమునందే లేదని నానమ్మకము.

విన—అయియుండవచ్చును. సంతోషమే కాని నీవు నాకు శత్రుపక్షపుదానవు కదా యిక్కడకు వచ్చి నీవు నాతో నీరహాస్యము లేల జెప్పితివి ?

చ—ఇంతకుముందే యీప్రశ్న మడుగవలసినది కదా? ఇప్పు డడిగితివేల ? ఇప్పుడైన మీరు నామనస్సును దెలిసికొనుటకుఁ బ్రయత్నించినందులకు సంతసించితిని. అంతమహారాజుగ నా! ఎందఱొందఱు రాజులనో పాదాక్రాంతులుగఁ జేసికొనినవారు

కదా ! అట్టిమహారాజునకు నేఁ డెట్టిస్థితి సంభవించినది! ఏమి చేయుచున్నారో యని యొకసారి చూడవచ్చితిని.

విన—బద్ధుఁడనై నందుల కెంతవిచారించుచుంటినో చూచి సంతోషించుటకేనా వచ్చితివి?

చవ—క్రోధముచే సంతోషించుటకు వచ్చిన దేవతెయో ? సాను భూతిచే విచారించుటకు వచ్చిన దేవతెయో ముఖమై ఖరిచేఁ గంఠధ్వనిచేఁ గనిపట్టనే లేకపోయితివా ? మీప్రకృతిజ్ఞాన మింతప్రశస్తముగ నున్నదేమి? మహారాజులే—అందులో విద్వాంసులే—అటుపై మహాకవులఁటే—ఆఁడుదాని తలవెండ్రుకఁ జూచి దానిమొగము కోలమొగమో గుండ్రమొగమో, దానిరంగు బాదముపప్పురంగో పటికబెల్లపురంగో, అది కొంగవలెఁ బొడుగుకాళ్ళదో బాతువలెఁ బొట్టికాళ్ళదో, దానిహృదయ మెండుపిడుకవలె రసహీనమో వేఱుపనసవలె రసవంతమో, ఒక్కనిముసములోఁ దెలిసికొనఁదగిన స్థితియే కాదా మీది? అంతచాకచక్యము లేదు సరేకదా ! నేను చెప్పినను దెలిసికొనలేకపోవలయునా ? ఇఁక మీవ్యాకరణపాండిత్యము వాదములో గుద్దులాటకా ? ఇఁక మీకవిత్వము గ్రంథాలు ధ్వస్తమొనర్చుటకా ? మగువహృదయ మెఱుఁగలేకపోయిన తరువాత మీమహారాజత్వ మెందులకు ? విద్యలన్నిటిలో నాఁడుదానిహృదయము చదువఁగలిగినవిద్యయే విద్య—ఆఁడుదానిహృదయమంతగ్రంథము ప్రపంచమున లేదు. మీవాల్మీకములు మీవిద్యారణ్యములు దానిముందు గిరగిరఁద్రిప్పి యావల పాఱవేయవలసినదే. మీరు తెలిసికొనలేకుంటిరి కావున నేను చెప్పుచున్నాను. నేను మీమైత్రిని గోరి వచ్చితిని. నమ్మవలయును.

విన—నాతో మైత్రి నీకేల? విగతరాజ్యుఁడనై, వ్యర్థుఁడనై, బద్ధుఁడనైన నేను నీకేమిచేయఁగలనని నీవు నాసఖ్యము గోరుచున్నావు. నేను నిన్ను నమ్మను. తిరుగ నెట్లో మోసముఁజేయుటకే నీవు వచ్చియుంటివో, నీరాణిచేఁ బంపఁబడితివో! నిన్న నీవేళ నేకదా బుద్ధాశ్రమమున నీవు సంపూర్ణస్వతంత్రుఁడనైన నన్ను నిర్లక్ష్యముగ నధిక్షేపించితివి! మాదకద్రవ్యపాత్రను జ్ఞానసింధువున కందించినది నీవే కదా?

చప—ఔను. నేనే! నీవు తూలి క్రిందఁబడిపోవుదువేమో యని నాజన్మము తరించునట్లు నిన్ను గట్టిగఁ గౌఁగిలించినదానను నేనే. దీని కేమిచెప్పెదవు?

విన—అసత్యమాడకు. నే నది యెఱుఁగను. నిన్న నేను నీకుఁ బ్రబలశత్రువను; ఈదినమునఁ బ్రాణమిత్రమునా? నీమాట కేమైన నర్థమున్నదా? నీమాట నాకుఁ దృప్తికరముగ నుండనక్కఱలేదు. నీకైన నున్నదేమో నీయంతరాత్మ నడుగుము. నిన్న నానోటిలో విసముఁ బెట్టిన నీ వీదినమున నా మొగమునకు మంగళపుటారతి నిచ్చుటకు వచ్చితివా? నేను నిన్ను నమ్మను. నిన్న ను నాయందు నీకున్న క్రోధ మిష్టముగా నిప్పు డేలమాఱవలయును.

చప—ఆహా! ఇందుకుఁగూడఁ గారణము చెప్పవలసివచ్చినదా? మహారాజా! నే నేమిచెప్పగలను? ప్రకృతిలో నిష్టానిష్టతలకుఁ గారణ మెవఁడు చెప్పఁగలడు.

విన—నే నడిగిన దొకటి నీవు చెప్పినదొకటి నాయందున్న యనిష్టత యిష్టతగా నేలమాఱవలయునని యడిగితిని.

చప—మీయందు నా కెప్పుడుఁగూడ ననిష్టత లేదు. మిమ్ముఁజూడనంతవఱకు నే నెట్టుఁగ నేయెఱుఁగను గదా! చూచిన వెంటనే నాకు

మీయందేదో నేను చెప్పలేనిది—అదివఱ కెఱుఁగనిది—అట్టిమనస్థితి నాకుఁ గలిగినది. నాప్రాణ మిచ్చిరైన మిమ్ము మదద్రవ్యపానమునుండి తప్పింపవలయునని యెంచితిని. చెట్టునకు నల్వురువంతున నాశ్రమమునకు వెనుకనే నూర్గురుభటులు కత్తులతో దాఁగియున్నారు నేను చచ్చిపోయినను నాయూహము మీకు లాభింపకపోవుటయే కాక, మీఁదుమిక్కిలి మీ ప్రాణములమీఁదికిఁ దెచ్చునని నేను నోరు మూసికొని యూరకుండవలసివచ్చినది. ఇక్కడకు మీరు వచ్చెదరుగదా అన్ని యంశములు మీతో మనవిచేయవచ్చునని యప్పటికి మీకు శత్రువట్లే నటించితిని. ఇప్పుడు నాయథార్థరూపమున మీయెదుటఁ బడితిని.

విన—నీ పేరేది?

చప—ఎంతసేపటి కడిగితివయ్యా! చపల.

విన—చపలా! నీమనస్సు దుర్గ్రాహముగ నున్నది నన్ను రక్షించుటకు నీ వట్లేల సాహసింపవలయును? నేనెవఁడను; నీ వెవతెవు? నీ పూర్వులెవ్వరైన నాపూర్వులయొద్ద నుండిరా? నీకు నాయెడల విశ్వాసమునకుఁ గారణ మేమియు లేదే! నామంత్రి నాకొఱకుఁ బ్రాణమిచ్చినాఁ డనఁగ నాతనికట్టివిశ్వాసమునకుఁ గారణమున్నది, నీ కట్టికారణ మేది? ఒక్కసారియేకదా నీవు నన్నుఁ జూచితివి. నావలన నొక్కపారితోషికమైన నీవు తీసికొనలేదే?

చప—మొదటిసారి చూచినప్పుడు కలిగిన యనురాగమే యనురాగము. అదియే శాశ్వతము. పదిసారులు చూచుటచేత, నాశ్రయించుటచేత, ముఖమోటమిచేత, నలవాటుచేత, నిఁకఁ దప్పదుగదా యని యనుకొనుటచేతఁ గలిగిన యనురాగ మొక యనురాగమా? వస్తుదర్శనమున నెంతశీఘ్రముగ ననురాగము

కలుగునో యంత శ్రేష్ఠము. అంతదివ్యము. ఆకాశమున నింద్రధనువు ప్రకాశించుచున్నది. దానిఁ జూచినవెంటనే మన స్సట్టి యింద్రధనుస్సురంగులతో వికసించి,యుబికి యింద్రధనుస్సుపై కెగిరి దానిలో నైక్యమైపోవుట యున్నదే అది ప్రశస్తానురాగము. అంతేకాని రాయఁగరాయఁగఁ బుట్టినవేడి తోమఁగఁదోమఁగఁ బుట్టినశుద్ధి యెంతకాల ముండును?

విన—(తలవంచుకొని మాటలాడక యూరకుండును)

చప—మహారాజా! ఊరకుంటి వేల? నాయభిప్రాయ మెఱిఁగియుండియు నెఱుఁగనట్లు కనఁబడుచున్నావా?యథార్థముగ నెఱుఁగకయే యున్నావా? ఓభగవంతుఁడా! సర్వహృదయాంతర్వర్తీ! నాప్రార్థన మాలకింపుము. తండ్రీ! ఈమహారాజును నేను గాటముగా వలచి నాహృదయ మాతని కెఱిఁగింపలేకున్నాను. ఒకవేళ నాయభిప్రాయ మాతఁ డెఱిఁగియుండియు ధనప్రధానమైనదాసి కావున దీనివలపు దొంగవలపని భ్రాంతిపడుచున్నాఁడేమో? ఓభగవానుఁడా! నీవు నానుదుటనువ్రాసిన లేఖనమున్నదే—దానిలో "ఇది వివయాదిత్యమహారాజును యథార్థముగా వలచు" నన్నపంక్తిని నీజ్ఞానస్ఫులింగలేశ మాతని కిచ్చి చదువుకొనునట్లు చేయరాదా? అప్పుడుకాని యాతని తిక్క తీరున ట్లగపడదు. ఓభగవానుఁడా! నామొఱ్ఱ నాలకింపవా?

విన—చపలా!ఇఁకఁ జాలు. నీ వాప్రసంగ మింకఁ జేయకుము.నీయనురాగము యథార్థమైనదే కావచ్చును. నీదయకు సంతసించితిని. ఆతల పింక మానుకొనుము.

చప—ఇదేమి మహారాజా! నిన్ను నేను వలచితిని- నీ కిష్టముండునా, సరే యనుము. లేదా నన్ను నిరాకరింపవచ్చును. అంతేకాని

నిన్ను నేను ప్రేమింపకుండ నడ్డుపెట్టుటకు నీ కేమియధికార మున్నది. ఆఁడుది మగవానిని వలచును. ఇది సృష్టిసూత్రము. ప్రపంచవ్యాకరణమునందున్న యీనిత్యసంధిసూత్రమునే యీడ్చివేయఁ దలఁచితివా? కాశ్మీరదేశము నీతీరుననే పాలించుచుంటివా? నీవే సృష్టి కధికారి వైనయెడల మూఁడుపూఁటలలో—

విన—చపలా! నాయభిప్రాయమును గ్రహింపకుండ మాట లాడకుము. నావంటివానిని గోరినయెడల నీ కడియాసయే కాని నీకోర్కె నెఱవేఱునది కాదు కావున వృథాశ్రమ మొందవలదని చెప్పితిని.

చప—నీవు నన్ను నిరాకరించినను నాకు శ్రమము లేదు. నీయందలి యనురాగమునుమూలమున నామనస్సులో విలువలేని వజ్రములగని పడినది. ఈవజ్రము లన్నియు జిలజిలమని మనస్సునకు దివ్యశోభ నిచ్చుచున్నవి. కార్తికి కపూర్ణిమాచంద్రికకంటె సహస్రగుణము లధికమైన పండువెన్నెల మనస్సునందుఁ గాయుచున్నది. ఈయనురాగమే నన్ను శాశ్వతజీవురాలిని జేయునని నావిశ్వాసము.

విన—చపలా! నీవు చెప్పిన దేదో నాకు నచ్చకున్నది.

చప—మహారాజా! మీకు నచ్చునని నే ననుకొనలేదు. నచ్చదని యెఱిఁగియుండియే చెప్పితిని. మీ కేల నచ్చును? మీయనురాగము నిష్కల్మషమైనదై యథార్థమైనదై మొట్టమొదటిదైనయెడల మీకు నచ్చియుండును. మీ కట్టియనుభవము లేదు. మీరు మహారాజులు. ఎంతసేపు వానిభండారము గొట్టి ధనము దోఁచుట—వీనితలఁ గొట్టి రాజ్యము దోఁచుట-ఒకని నొకనిపై నెక్కించుట- ఇంకొక్కని గ్రిందికిఁ దింపుట- మఱి

యొకనిని గిరగిరఁద్రిప్పి నేలఁగొట్టుట—ఎంతమే లొనర్చిన వానినైన మెచ్చకుండుట—గోరంతతప్పును గొండంతచేసి శిక్షింపఁబూనుట- తుట్టతుద కెవ్వానినిగూడ నమ్మకుండుట- ఇంతేకాదా మీరాజ్యతంత్రిమర్యాద? మీహృదయము నెన్నఁడైనఁ బరీక్షించుకొంటిరా? అనురాగతత్త్వ మేమో మీరెఱుఁగుదురా? నిన్నను మీతల నామెడముబుజమున వైచినారు. ఈస్థల మంతయు నెట్లు హేమించిపోయినదో పరీక్షింపుఁడు. ఇటు చూడక యటు చూచెద రేల?

విన—నా కేపరీక్షయు నక్కఅలేదు. కాలవైపరీత్యముచే నేను దుస్స్థితిలో నున్నాను. ఈసమయమున నీశృంగారాలాపములచే మఱింత బాధగా నున్నది. నన్ను మన్నింపుము.

చప—ఇంతేకద! ఇంతేకద! మీకుఁ గారాగారవిముక్తి నే నొక్కపదినిముసములలోఁ జేయఁగలను. నాకోర్కె మీరు తీర్తురా? ఊఁ యన్న యెడలఁ జాలును. ఈరాత్రియే తీర్పనక్కఅలేదు. ఇదిగో తాళములు— ఈతాళ మీకొట్టిది- ఈతాళము సింహద్వారపుది—మహారాజా! ఈవలికి రండు. నేను మిమ్ముఁ గోటగుమ్మము దాఁటింతును. మీతోఁగూడ రమ్మన్న వచ్చెదను. లేదా మీ రొక్కరే పొండు. నాల్గుమాసములలో నేను మీకడకు వచ్చెదను. నన్ను మీ రప్పుడు చేపట్టవలయును. ఏమందురు మహారాజా!

విన—చపలా! నీసాహసము మెచ్చఁదగినది—కాని నే నేకపత్నీవ్రతుఁడ నగుటచే ని న్నంటఁజాలను. నేను కారాగృహమునదే నివసింతును.

చప—అంతే? అంతే?

విన—నాదృఢసంకల్ప మంతే.

చప—సెబాస్! మహారాజా! కాని ని న్నెంతకాలము కారాగృహ
మందుంతురో నీకుఁ దెలియునా?

విన—ఎంతకాల ముంచిన సరే.

గీ. గడియ కారాగృహావాప్తి । ఘనత కాదు
పదియునాళ్లబ్దము లది లో । పంబు కాదు
ఒకయుసత్యం బసత్యవా । దికి విశేష
మింకఁ బదునా ల్గసత్యముల్ । హేయ మగునె?
ఒడల శ్వేతంపుమచ్చలు । పొడమినప్పు
డెన్ని యెంతకాలపు వని । యెన్న నేల?
నరుఁడు చెడఁదాఁగి దెసములఁ । దిరుగుచుండ
నెంతసేపటినుండియో । యెన్న నేల?
ప్రభుఁ డొసఁగునీవి యెంతని । పలుకవచ్చు
నతఁ డొసఁగుతిన్నె లెన్నని । యరయ నేల?
జనునిబహుమానమున మాన । సరణి కాని
పరిభవమునందుఁ బరిమాణ । కరణ మేల?

చప—నీతో నొక్కమాట చెప్పుట కింతవఱకు నోరురాక చెప్పలేదు.
నీసాహసము చూడ నాకుఁ జెప్పక తప్పదు. నీమృతితో నింక
యుద్ధవార్తయే యుండదుకదా యని యెంచి మాసేనానా
యకయగు దుర్గ నిన్నుఁ గారాగృహమందుఁ జంపవలసినదని
మారాణిగారిని ప్రోత్సహించుచున్నది. ఆమె యిప్పటివఱకు కం
గీకరింపలేదు. ముం దేమగునో తెలియదు. కావున నామనవిని
విని కారాగృహమును వదలిపొమ్ము.

విన—కారాగృహవాసముకంటెఁ గాలగతిచెందుట కఠినమా !

గీ. అమ్మయొడిలోనిపిల్లవాఁ । డట్టె యావు
లించి నవ్వుచుఁ బరలోక । మేగుచుండ,

ఛాత్రికము కరీకుశోఁ బరాజయపుసిగ్గు
వత్సనాభిని దిగమ్రింగి వైచుకొనఁగ,
భర్తతోఁ గల్గు కాసంతపట్టుచేత
కాంత తనువును గంగలోఁ గలుపుకొనఁగ,
హేయమగు జంతు వెదిమైన నిసుకరేణు
వంతయులజడి తను విచ్చి యడఁచుకొనఁగ,
భ్రష్టరాజ్యపరీభావభారమునను
ప్రాణకాంతావిరహజన్యబాధవలన
బంధసంబంధదుఃఖదుర్భరతవలన
సచివసేనావిసర్జనశ్రమమువలన
నిలువునిల్వ్వన నీరౌచుఁ గలఁగు నేను
మృతి యనఁగ నేల జడియుదు నెంతమాట!
నత్తవీఁపుపై గుల్లయు నాథుతలను
మకుట మొకరీతిఁ బగులుచు మహిని బడవె?

చప—సెబాస్! మహారాజా! నీయేకపత్నీవ్రతమున కెక్కడ భంగము కలిగిపోవునో యని కారాగృహమందే యుండ నిశ్చయించితివి మరణమునకైన సిద్ధపడియుంటివి. మగవారిలో నీవే మగవాఁడవు ఆఁడువారిలో నీ స్పర్శమున ధన్యమైన నీరాణియే యాఁడుది. కాని నీవ్రతమున కెంతమాత్రమును భంగమును జేసికొననక్కఱలేదు. నాకోర్కె తీర్పుమని నిన్ను నే నడుగను. తీర్పనక్కఱలేదు. ఈవలకు రమ్ము. అయిదునిముసములలో నిన్ను వీథిగోఁకకి సాగనంపి నేను తిరిగివచ్చి మా రాణిని సేవింపఁబోదును. ఇంకను సందేహ మెందులకు?

విన—నీవు నాకుఁ జేయనున్న సాహాయ్యమునకై చాల సంతసించితిని. నీ కాతాళము లెట్లువచ్చినవి?

చప—మారాణిగారి పడకగదిలోఁ జిలుకకొయ్య నున్నదీనిని రాణిగారు నిద్రించుచుండఁగా సంగ్రహించితిని.

విన—నీరాణియందు నీవంత విశ్వాసద్రోహముగ వర్తించుట తగునా? రాజ్ఞిసేవలో నీవుచేసిన యీపని మహాపాపము. నేను నీవంటిదానివలన నుపకార మొందను.

చప—ఆహా! త్రవ్వినకొలఁది నీయూరువళ్లు, నీతో మాటలాడినకొలఁది నీసుగుణగణము వృద్ధిఁబొందుచున్నదే—కాని మహారాజా! యోగ్యతకుఁగూడ హద్దున్నది కాని లేకపోలేదు. మహారాజా! ఇంతమడికట్టుకొన్నయెడల నింకఁ జెప్పవలయునా? నిన్ను మారాణి మోసముచే నిటకుఁ దెచ్చినది నీవు తిరిగి మోసముచే వెడలిపోక యింతతొట్రుపాటు పడుచుంటి వేల? రాజనీతి యిటులే నిర్వహించుచుంటివా?

విన—నన్నామె మోసముచేఁ దెచ్చినది సత్యమే తిరుగ నే నామెను మోసముచేయవచ్చుననియే యనుకొనుము. కాని యీమోసము—నీసాహాయ్యమున—విశ్వాసహీనవై ప్రవర్తించిన నీసాహాయ్యముచేత మాత్రము—చేయుట నాకుఁ దప్పుగాఁ గనఁబడుచున్నది. విశ్వాసహీనత నెవరియందైన సరే నేను ప్రోత్సహింపను.

చ—నాయందు నిజమైన నమ్మకము లేకపోవుటచే నిన్ని కప్పదాఁటులు వైచుచున్నావు.

విన—శాంతమ్ పాపమ్- నీవు తప్పుమాట లాడితివి!

చప—ఆడినయెడల క్షమింపఁదగును కాని మహారాజా! ఇంత ఋజుస్వభావుఁడవు-ఇంతశాంతియుతుఁడవుకదా—పనిలేక కాని స్త్రీరాజ్యముపై దండయాత్రకెందులకు వచ్చితివయ్యా! అశ్వబలముతోఁ గాల్బలముతో ఫిరంగులతోఁ గత్తులతో రానేల?

నేర్పుగా నొక్క పూవు విసరినయెడల వాఁడుది చచ్చును గాని ఫిరంగిదెబ్బ కెన్నఁడైనఁ జచ్చునా? బుద్ధిపాకచక్యముచేత మా యలమారితనముచేతఁ గనుకట్టుచేత వాఁడుదానిని జయింప వచ్చునుగాని, మొండి మోటబలముచేత నీవు కావుకదా బ్రహ్మ దేవుఁడైన వశపఱచుకొనఁగలఁడా? అట్టిబుద్ధిని నీ వింటియొద్దఁ బెట్టివచ్చితివి. ఇఁక నీకుఁ గారాగృహబాధ మాశ్చర్య మేమున్నది? నిన్ను వలచిన నేను నీకు విముక్తి నిచ్చెదను రావయ్యా యని యాచించిన వలపువలదు విముక్తియు వల దంటివి. కారణ మేమి? ఏకపత్నీవ్రతత్వము. మహారాజా! వెఱ్ఱి యింతకంటె భిన్నముగా నుండునా? పెద్దలమాట తల త్రిప్పుకొని తిరుగువారి కందఱకు వేఁపకాయయంతో వెలఁగకాయయంతో వెఱ్ఱియున్నది కాని లేకపోలేదు — ఏకపత్నీవ్రతము వదలుకొనక్కఱలేదయ్యా కోటకలుపులు తెఱచెదను మాయూరు పోవయ్యా యని నే నెంతయేడ్చినను వినక యందుల కొక పనికిమాలిన వంక పెట్టితివి ఇంతకంటె నీ కింకఁ జెప్పవలసిన దేమున్నది. నాయాస లన్నియు నడుగంటినవి కావున నన్నుఁగూర్చి రవంత చెప్పెదను విందువా ?

విన — అభ్యంతర మేమి?

చప — నే నేకపత్నీవ్రతుఁడనని మీరు గర్వపడనక్కఱలేదు నే నేకభర్తృవ్రతదీక్ష నీకుణమున నే పూనినాను. నీకు భర్త యెవరని మీరడుగుదురేమో — మీరే — ప్రాణము హరియని విడుచువఱకుఁ బరపురుషుఁ దలఁపనైనఁ దలఁపను. నాసాహసము నానియమము చూచుకో! దాసిదాని కేమి యీనియమ మేమని మీరు వెకవెక లాడవచ్చును — దాసిదాని నధిక్షేపించుటలో నందఱు ఘనులే — తలపైఁ గట్టెమో పున్నవాఁడే ఘనుఁడైనప్పుడు కిరీటి మున్నవానిమాట చెప్పవలయునా? తొంబది

వ్యాపృతులుగల మగవాఁ డేకపత్నీవ్రతుఁడైనాఁడనఁగ విశేష మేమియు లేదయ్యా. కాని పురుషానురాగమే జీవనమునకు జీవనమైన యాఁడుది యేకభర్తృవ్రతదీక్ష నెఱపినయెడల నెంత విశేషమో చెప్పవలయునా? అందులో దాసి—పక్కనిండే కడుపునిండైన దాసి—విటులవృద్ధినిబట్టి గౌరవవృద్ధిగల దాసి యేకభర్తృవ్రతదీక్షయే నెఱపినయెడల నప్సరస లంతరిక్షమునఁ దాండవ మాడవలసినదే-దేవతలు నాతపస్సునకుఁ దహతహలాడి తిరుగ విష్ణువు నవతరింపఁజేయవలసినదే—అదిగో నవ్వుచున్నావు. నేను గర్వాలాపనే యగుదును, మాటలవడిగల దాననే యగుదును- ఇది చూచి నీవు నవ్వుచున్నావు కాని-ప్రాలేయాచలమువలెఁ జలింపనిదీక్ష గలదాననని—

విన—చపలా! క్షమింపుము. నిన్నధిక్షేపించుటకు నేను నవ్వలేదు. ప్రకృతిలో సర్వజాతులందును సామాన్యమైన సత్యమును నీవు కప్పిపుచ్చి తద్వ్యతిరేకమును గూడ నుపన్యసించుచున్న నీసాహసమును జూడ నాకు నవ్వువచ్చినది. ఆఁడుది స్వభావసిద్ధముగ స్థిరచిత్త మగవాఁడు చపలుఁడు. ఇది ప్రకృతిసత్యము. అందుచే మగవాఁ డేకపత్నీవ్రతుఁడైనాఁడనఁగ విశేషము కాదా! అందులో స్వైరవిహారమునకు సహస్రావకాశములున్నరాజు స్థిరచిత్తుఁడైనయెడల మఱింతవిశేషము కాదని యెవరైన ననఁగలరా?

చప—సరే- ఎవరివిశేషములు వారు చెప్పుకొని సంతోషించువారే కాని ప్రకృతిసత్యము ననుసరించి నడుచుచున్నవారెవ్వరు?పోనీ నీవే గొప్పవాఁడవు. నీవే సర్వవిధముల శ్లాఘ్యచరిత్రుఁడవు. అయిననేమి? ఇక్కడ బద్ధుఁడైయుంటివే. అదిగాక యిక్కడ నీకుఁ బ్రాణముమీఁదివఱకు వచ్చును గాని, రాకపోదు. అప్పుడు

నా ప్రాణ మిచ్చియైన నీప్రాణమును గాపాడుట నిశ్చయము. నిశ్చయము. ఇది నాశపథము. మీఁదఁ జేయవలసినట్టి దేమనఁ గన్ను పూర్తిగావిప్పి చూచుటకైన నోల్లనిభర్తృపాణిములు కాపాడిన యీదాసియె యాచక్రవర్తికంటె ఘనురాలని లోకముచేఁ గొనియాడఁబడుదును. ఇఁక నట్టి మాటలాడను. నేను నారాణిని సేవింపఁబోవుదును. నమస్కారము.

(నిష్క్రమించును.)

విన—ఆహా! ఎంతటిదాసిరో! దీనియనురాగము యథార్థమనుటకు సందియము లేదు. మంచికట్టుదిట్టమైన మనస్సుగలదివలెఁగూడఁ గనఁబడుచున్నది—పాప మాశాభంగమునొందిపోయినది; ఏమిచేయువచ్చును? ఇంతమహాదురవస్థలో నున్న నాకెంతయో మేలుచేయుటకు వచ్చియున్నది. అయిననేమి? నే నట్టియవకాశ మొందఁదగదు. కారాగృహముననే యుండెదను.

గీ అస్మదీయదిగ్జయుపరి । వ్యాప్తి కింత
భరతఖండమె మిగుల స్వ । ల్పం బటంచుఁ
గొట్టకొన్నాడ నిప్పు డీ । కొట్టె నాకు
నతిపరీణాహసంపన్న । మయ్యె నహహ!
కాలుమన్నను బద్దలతోఁ । గలచినట్టి
గ్రావములపైకి దుముకుచు । వనమునంత
యంకెలిడి దద్దరించుచు । వృక్షశాఖ
మెలుకబోనులో నిముడంగ । వలసె నేఁడు ;
నేఁడు భాగ్యాధికత మఱి । నాఁడు ముష్టి
నేఁడు రాష్ట్రపాలన మఱి । నాఁడు కార
నేఁడు శక్రభోగము మఱి । నాఁడు చావు
జనవరున కిట్టి లీవప్రిపం । చంబు దొరలు.

ఆ. మొలను గోచితోనొ । తలపైఁ దురాతోనొ
యేకరీతి దినము । లేగ మంచి
యొగుడుఁదిగుకుబాధ । మృతిని మించినమృతి
విషమగతియె సృష్టి । విధము కట్ట!

ఆహా! ఎంతమరవస్థ సిద్ధించెను! నేను లేకపోవుటచే సైన్యము చెల్లాచెదరయిపోయినదేమో! మంత్రులేమియూహించుచున్నారో? దామోదరశర్మ నన్నాశ్రయమునవదలి యేగుట కెంతయో సందేహించినాఁడు నేను స్త్రీరాజ్యమున బద్ధుఁడనైతినని యాతఁడు గ్రహింపలేకుండునా? ఏమో? ఇక్కడ కాతఁడు సైన్యముతో వచ్చి కోటను ముట్టడించునా? నాప్రాణము లీ రాణిచేతిలో నుండఁగాఁ దా నంతమోటపని చేయునా? ఒకరో యిద్దరో, ప్రచ్ఛన్నముగనో బహిరంగముగనో వచ్చి యిచ్చటివ్యవహారము లన్నియుఁ దెలిసికొని తరువాతఁ జేయఁదగినది చేయుదురని యనుకొందును. నిదురవచ్చుచున్నది. ఆప్రక్కను బండుకొందును.

(నిష్క్రమించును.)

ఇది తృతీయాంకము.



శ్రీ

# చూడామణి.

## చతుర్థాంకము.



ప్రదేశము :—స్త్రీరాజ్యమునఁ గోట.

[ప్రవేశము—కోటబురుజులనడుమ జగన్నాథుఁడు, సీతారాముఁడు ]

జగ—సీతారాముఁడా ! ఏదో పెద్దసేన కోటను ముట్టడించు నని సేనాధిపతమ్మ చెప్పినదఁట. ఏదియుఁ గనఁబడదేమిరా?

సీతా—సేనాధిపతమ్మకుఁ బిఱికితన మెక్కువరా? ఆమెకుఁ దలకాయ చిన్న గుండెకాయ పెద్ద- చూడలేదఁటరా? మొన్నరాత్రినుండి కోటతలుపులు బిగించుకొని సైన్యమునంతను లోపల నమర్చు కొని రాణిగారితోఁగూడ లోన నందఱుఁ గూరుచుండి గుసగుస లాడుచున్నారు.

జగ—మన మింతలో యుద్ధానికి సిద్ధపడి యుండనక్కఱలేదని మంత్రి మందాకినమ్మ చెప్పినదఁట కాదా?

సీతా—మంత్రి రవంత నామనస్సునకు వచ్చినదిరా. ఆయమ్మకుఁ బిఱికితనము లేదనలేను గాని యంతో యింతో తెలివి యున్న ది. ఈసేనాపతమ్మ వట్టిమట్టిముద్ద. తెలివితేటలు లేకపోయినఁ బోనీ—ఏవో నాల్గుమాటలైన నాడవలయునా? అదిగూడ సున్నయే. ఇంక ధైర్యము చూడఁబోయిన నీసొగసుగా నున్నది.

మొత్తము మీఁదమాత్ర మాఁడుదానికి మగవానిచేయితగిలినఁ గాని గుండెనిబ్బరము కలుగుటమాత్రము వట్టిది.

జగ—ఛీ. ఛీ. అదేమిమాటరా? మనరాణిగారంత పోటుబంటు మఱెవ్వరైన నున్నారఁటరా ?

సీతా—రాణిగారిమాట వేఱురా ? రాణిగారైనప్పు డాఁడుదా మగదా యని చూచినక్కఱలేదు. రాణిగా రనఁగ మగ దన్నమాటయే. ఎందుచేతనో యడుగవేమి ? కిరీటము నెత్తిమీఁది కెప్పుడువచ్చినదో గుండెలలోని కప్పుడే పౌరుషము వచ్చిన దన్నమాట. దీనిలో నున్నకిటుకిది రా.

జగ—సరి. దీని కేమి కాని, నే నడిగినమాట కేమిచెప్పితివి ?

సీతా—ఏమడిగితివి ?

జగ—రాణిగారితరువాత మనకు మంత్రియేకదా. మంత్రి యింతలో యుద్ధ మక్కఱలే దన్నప్పుడు సేనాపతమ్మ యింత యుద్ధప్రయత్న మేలచేయవలయును?. రాష్ట్రములో మంత్రి పెత్తనమా సేనాపతమ్మ పెత్తనమా?

సీతా—రాష్ట్రములో నొకని పెత్తనమన్నమాట యేమి? ఒకప్పు డొకనిపెత్తనము ఇంకొకప్పు డింకొకనిపెత్తనము. కోటలో ధనముండి యందఱు సుఖముగా నుండినప్పుడు మంత్రిపెత్తనము—గ్రుద్దులాటవఱకు వచ్చినప్పుడు సేనాధిపతి పెత్తనము. రోగాలు వచ్చినప్పుడు వైద్యుని పెత్తనము. శుభకార్యమైనప్పుడు దాసిదాని పెత్తనము—ఎవఁడైన గుటుక్కుమన్న యెడలఁ బురోహితుని పెత్తనము—తుట్టతుదకుఁ గ్రొత్తవాఁ డెవఁడైనఁ గోటలోకి వచ్చినప్పుడు నాది నీది పెత్తనము. ఈ పెత్తనాలకు హద్దేమి?

జగ—ఇఁకఁ బ్రభువుగారి పెత్తన మెక్కడ?

సీతా—పుచ్చుకొన్న వారివలనను బుచ్చుకోనివారి వలనను దిట్లు తినుటలో—

జగ—ప్రభువును దిట్టినవాఁ డెన్నటికి బాగుపడఁడనుకో. పాపము మూటకట్టుకొనుటకుఁగాని రాణిగారిని దిట్టుట యెందులకు? రాణిగారియంత యమ్మగారి నీసృష్టియంతలోను మఱియొకరిని జూపుము. చెవి గోయించుకొందును. అంతేకే నిద్రలేచి యా మెకు మ్రొక్కుకో. అన్ని పాపా లెగిరిపోవునో లేదో. పుచ్చుకొన్నవాఁడు తిక్లే. పుచ్చుకొననివాఁడు తిక్లే యంటివి. మనసా మ్మామెయొద్ద దాఁచఁబెట్టితిమా యేమి? అ. అ. చూడు సీతారామన్నా! ఎవరినో తెచ్చి కోటలో దాఁచినారఁట. ఊరిలో నొక్కఁటేగోలగాఁ జెప్పుకొనుచున్నా రేమిరా?

సీతా—చచ్చుచుండఁకొడుకులు కాకపోవునెడల నీమాత్రమున కింత గోల యెందులకు? చపలకుఁ దగినమగనిని—తగిన యనఁగా నేమియో తెలియునా? చిన్నవాఁడు రోగమురొచ్చులేని వాఁడు అట్టి యూసలేదు. రెండమూఁడులక్షల రాఁబడికల రవంత రాజ్య మున్నవాఁడు బుద్ధిమంతుఁడు సొగసరి రాణిగారి చెప్పుచేఁతలలో నుండువాఁడు—అట్టిమగనిని దీసికొని రావలసినదని సేనాపతమ్మగారితో రాణిగారు సెలవిచ్చినారు—అందుపై నాయమ్మ తిరిగి తిరిగి యొక్కనిఁ దెచ్చి కోటలో దాఁచి పెట్టినది.

జగ—బుద్ధసన్యాసమ్మవంటి రాణిగా రేమి? అట్టిమాట చెప్పుట యేమి? నేను నమ్మను. పోనీ. తెచ్చినమగనిని దాఁచిపెట్టు టెందులకు?

సీతా— ఆపిల్లవానితల్లిదండ్రులకీలోపల తెలిసినయెడల వా రాతనిఁ దీసికొనిపోవుదురు. అదిగాక చపల శూర్పణఖను మించిన.

రాకాసిముండ—దీనినిగూర్చి యాతఁ డెక్కడఁ బుంజాలుత్రెం పుకొని పాఱిపోవునో యని యాతనిని యజ్ఞపశువుక్రింద బంధింపవలసివచ్చినది.

జగ—నీవు చెప్పినమాట నాకేమియు నచ్చలేదు. సరే అతనిని దాఁచిపెట్టినారు—కోటలోతలుపుల కారాత్రినుండియే తాళములువైచు టెందులకు?

సీతా—ఇంతయుతిమాలినపెద్దమ్మ వేమిరా ? ఆతనిసంబంధు లెవ్వరు కోటలోనికి రాకుండుట కని తెలిసికొనలేవఁటరా ?

జగ—ఎవరయ్యా-ఎవరయ్యా- దూరమున నుండుము. కోటలోనికి రా వీలు లేదు.

[దామోదరశర్మ ప్రవే॥]

దా—ఉదయమునఁ బదిగంటలైన నింకఁ దలుపులు తెఱవరేల ?

జగ—ఎన్నియుదయములైన మా కేమిలెక్క. మాయిష్టమువచ్చినప్పుడు తెఱచెదము. నీ కీగోడవ యెందులకు పోవయ్యా.

దామో—(తనలో) మామహారాజెక్కడనున్నట్లు స్పష్టము. తలుపు లిట్లు బంధించుకొనుట కేవలము బుద్ధిహీనత. మా కాయువు పట్టయిన మామహారాజు వారియధీనుఁ డైనప్పుడు తలుపులు తీసియున్నఁ బ్రమాద మేమి ? మేము సేనలతోఁ గోటలో బలాత్కారమునఁ బ్రవేశింతుమా ? (ప్రకా) మొన్న రాత్రి యిటకుఁ దీసికొనిరాఁబడిన పురుషుఁడు సుఖముగా నున్నాఁడా ?

సీతా— నీ వాతనితండ్రి వా యేమి ?

దామో—(తనలో) ఇఁక నేమి, మామహారా జిక్కడ నున్నట్లు మఱింత స్పష్టమైనది. ఆహా ! అనుమానించినట్టే యయినది.

(పరిక్రా) మీరొకరు పోయి కాశ్మీరదేశమంత్రి వచ్చినాఁడని మీరాణిగారితోఁ గాని మంత్రితోఁ గాని చెప్పెదరా?

సీతా — మీరు మంత్రులా బాబూ! దండాలు. కాశ్మీరదేశ మనఁగా రామేశ్వరముదగ్గఱదే కాదా బాబూ! పండుగ వచ్చుచున్నది. క్రొత్తపంచెలఁ గట్టుకొందును.

దామో — అలాగే.

సీతా — జగన్నాథా! నీ విక్కడనుండుము. నేను పోయెదను.

(నిష్క్రమించును).

దామో — జగన్నాథా! ఏదో యుద్ధప్రయత్నమున మీ రాజుగారున్నారని యూర ననుకొనుచున్నారు. మీ వా రెవరిమీఁదికైన యుద్ధమునకుఁ బోయెదరా? మీపై నెవరైన యుద్ధమునకు వచ్చెదరా?

జగ — మేము తక్కువభటులము. మా కీపెద్దమాట లేమి తెలియును బాబూ!

[నేపథ్యమున]

ఆమంత్రిగారిని రవంతసేపు కోటగుమ్మముప్రక్కనున్న నిరీక్షణశాలలోఁ గూరుచుండుమని చెప్పుము. కోటతలుపులు తెఱచుటకు రాణిగారి యుత్తరువైనది. నీవు పైనుండనక్కఱలేదు. ఇఁక దిగుము.

జగ — అయ్యా! వాఁడు చెప్పినది వినఁబడినది కాదా! మీ రాప్రక్కగదిలో దయచేయుఁడు. నేను పోవుదును.

(ఇద్దఱు నిష్క్రమింతురు).

ఇది విష్కంభము.



ప్రదేశము:-కోటలోని సభాశాల.

[ప్రవేశము:-పద్మావతి, మందాకిని, దుర్గ, దామోదరశర్మ.]

మందా—మీరేల మాకు దర్శన మిచ్చితిరని రాణిగారు మిమ్మడుగు చున్నారు.

దు—వేఱె చెప్పనేల ? వారిరాజుగారి నిమ్మనియడిగి తీసికొని పోవుటకు—

దా—మారాజుగారి నిమ్మని మిమ్ము యాచించుటకు వచ్చినవాఁడను గాను. అట్లు యాచించుట నాకుఁ దప్పని కాదు. నేను బ్రాహ్మణుఁడ నగుటచే నాకు భిక్ష జన్మ స్వాతంత్ర్యమే అందులో స్వహితాభిలాషచేఁ గాక లోకహితార్థమై మాప్రభువును మాకిమ్మని యాచించుట నాకు బొత్తిగాఁ దప్పుకాదు. కాని మారాజుగారి కది లోపము కావున నే నట్లు యాచింపరాలేదయ్యా.

మం—మంచిమాటయే కాని మీ రెందులకు రాలేదో చెప్పుమని మారాణిగారు మి మ్మడుగలేదు—ఎందులకు వచ్చినారో చెప్పుమని—

దా—మందాకినమ్మా ! ఆసంగతి యెఱుఁగకపోలేదు; కాని బుద్ధిమతియైన దుర్గమ్మ యడ్డుదిడ్డముగాఁ జెప్పుటచే నట్లనవలసి వచ్చినది రాజ్ఞీమణీ ! మా రాజుగారిని మీరు మోసముచేఁ దెచ్చినారు. బాహుబలము చాలకపోవుటచేఁ—బాప మట్లు చేయవలసివచ్చినది. మీస్థితి కనుగుణమైన పనిని మీరు చేసినారు. ఆమాట యిప్పు డెక్కుడలేదు కాని నాయొక్క ప్రార్థన మున్నది. మారాజుగారి మంత్రినగుటచే నాయన తరువాత నేను మీకుఁ బ్రధానశత్రుఁడను. శత్రుబంధనము కాఁదగినది కావున నన్ను మీరు బాధింప వేఁడుచున్నాను.

ప—మిమ్ము బంధింపవలసిన యావశ్యకత మాకేమి యున్నది?

దా—మీకుఁ గేవల మావశ్యకమని నేను మనవిచేయలేదు. నాకే యది యావశ్యక మగుటచేతను మిమ్మట్లు ప్రార్థించుచున్నాను.

దు—ఇద్దఱు కలసి పాఱిపోవుటకా యీయాలోచనము?

దా—మే మట్లు పాఱిపోవువారము కాము.

దు—ఏమో! ఈమాటల కెక్కడకు?

ప—దుర్గా! అధిక్షేపింపకుము. మోసముచేఁ దేఁబడినవాఁడు పాఱిపోయినను దప్పులేదు. మనకు మోసము ఘనమై వానికిఁ బాఱిపోవుట తప్పగునా? రెండును సమానములే; కాని దామోదరశర్మా! మాచే బధింపఁబడుట నీ కావశ్యక మేలయో చెప్పకపోయితివి.

దా—వినయాదిత్యమహారాజు నేను నత్యంతమిత్రులము ఒక్కచోఁ జదువుకొని, పండుకొని, యాటలాడి బాల్యమును గడపినవారము. ఆతఁడు నాకు బహిఃప్రాణము. ఆతఁ డొక్కఁడు కారాబద్ధుఁడై యుండుట నాకు బహుదుస్సహముగ నున్నది. నన్నుఁ గూడ నాతనితో బంధించి నావ్యథ మాన్పి పుణ్యము కట్టుకొనుటకై ప్రార్థించుచున్నాను.

దు—ఆతనికొట్టులో నే నిన్నుఁగూడ బంధింపవలయునా?

దా—అదియే నాప్రార్థన. ఆతఁడు పరమసుకుమారి మహాభోగి- కారాగృహవాసమున మిగుల శ్రమ నొందుచుండును. ఆయనకు నాచేనైన యుపచారము లొనర్చుచు నాతని సేవించుచు నాతనువును సార్థక పఱచుకొందును. కటాక్షింపుము.

పద్మ—(అప) మంత్రీ! ఆయనను బహుగౌరవయుక్తముగ నాదరించుచు వాయన రుచితోపచారముల నాచరించుచు మహా

రాజప్రవృత్తి యంతయు నిర్వహింపవలయు నని భటుల కాజ్ఞా పించితివి కాదా?

మందా—(అప) ఆవిషయమున సేనానాయక పెత్తనమగుటచేత నే నేమియుఁ జేయలేదమ్మా!

స—(అప) దుర్గా! వినయాదిత్యమహారాజునకు మహారాజార్హము లైన యేర్పాటు లొనర్చితివి కాదా?

దు—(అప) అమ్మా! ఆయన నట్లు గౌరవింపవలయునని మీరు సెల వీయకపోవుటచేత నే నేమియుఁ జేయలేను. రాజద్రోహకరుల నుంచుకొట్టులో నుంచితిని.

మ—(అప) నేను చెప్పకపోవుటవలన నీ వూరకుంటివా? చెప్పలేదన్న తప్పు నాపై వైచితివా? నేను చెప్పనేల? ఎవరి నెట్లు గౌరవిం పవలయునో నీకుఁ దెలియదా? ఆతనిని రాజద్రోహకరుల నుంచు నినుపబోనులో నుంచితివా? ఆతఁ డెట్లు రాజద్రోహుఁ డగును? ఆతఁడు మనభృత్యుఁడా? ఉద్యోగియా? సామం తుఁడా? ఆతఁడు మనతలపై హిమాలయమంత నెత్తుగ దాఁటిపోయిన మహాఘనుఁడే—ఆతఁడు రాజవిధి ననుసరించి మనకోటపై దాడివెడలుదు నని హారనంపినాఁడు. అది రాజ ద్రోహమా? నిజముగా మనమే యాతనికి ద్రోహ మొనర్చినాము వీరాధివీరుఁ డైనయాతఁడు మనకు యుద్ధవార్త నంపఁగ మన మేమిచేసితిమి? మనకు లేని మగయంగులను దెచ్చుకొని యందుపై సన్న్యాసమును దెచ్చుకొని యాతనిగొంతులో నుమ్మె త్తగింజలదావకమును బోసి యిక్కడకుఁ దెచ్చి మహాకార్య మొనర్చితిమని విఱ్ఱవీగుచుంటిమి. అంతటితో నూరకుండక గజ రాజమును దెచ్చి గాదిదెసాలలో నుంచితివి. అతనిని మోహ

ముచే బంధింపఁగూడదని నే నెంతచెప్పినను మీరాజు వినక నా కీయప్రతిష్ఠఁ దెచ్చినారు.

మం—(అద) అమ్మా! క్షమింపుము. మొన్న రాత్రియే కదా యాయన నిక్కడకుఁ దెచ్చినది. తగినయేర్పాటు లొనర్చుటకు దుర్గమ్మ కింత వ్యవధి చాలదు కాఁబోలు ఈసాయంకాలములోపల నాయనకన్ని—

ప—(అద) చాలు చాలు! (ప్రకా) దామోదరశర్మా! మీమహారాజున కింతటినుండి యుపచారలోప మేమియు జరుగకుండున ట్లమోఘములైన యేర్పాటు లొనర్తును. ఆయన మానసికశ్రమమును మేము నివారింపలేము కాని దేహశ్రమ మేమియు నాయనను బడనీయము. నాయుద్యోగు లాతనిని బూలలోఁ బెట్టి యాదరింతురు. కావున నీ విందుకొఱకు బద్ధుఁడవు కా నక్కఱలేదు. కాని దామోదరశర్మా! ఒక్కమాట. నీరాజు బద్ధుఁడైనపుడు నీవు స్వేచ్ఛతో నుండి నీరాజునకు స్వేచ్ఛ నొసఁగుటకై భూమ్యాకాశములను గలుపుటకైనఁ బ్రయత్నింపవలయును గదా! అట్టిప్రయత్నమును బూర్తిగా వదలుకొని నీవుకూడ నాతనివలెనే కాలుసేతులు కట్టుకొని కొట్టులోఁ గూరుచుండి యాతఁ డొక్కనిశ్వాస మీయఁగ నీవు రెండు నిశ్వాసముల నిచ్చి, యాతఁ డొక్కబాష్పము విడువఁగ నీవు నాల్గుబాష్పములు విడిచి యొకని నొకరు చూచుకొనుచు నుండినందువలన నీకు లాభమా, ఆతనికి లాభమా? నీమిత్రులు మెత్తురా? నీశత్రులు వెత్తురా? నీ వాతని మంత్రిత్వమందులకు నీవు బుద్ధితో నాతని ఋణము దీర్చుకొనవలసినదా? కన్నీటితోఁ దీర్చుకొనవలసినదా?

దా. మో.—అమ్మా! అంతస్పష్టముగా నడిగినారు కావున నేనును

స్పష్టముగనే చెప్పెదము. మాకు మహాసైన్య మున్నది. మా దానిలో నెనిమిదవభాగమైనను మీకు లేదు. మీ తేజము మా యెదుట సూర్యునిముందు జుక్కవంటిదైనఁ గాదు. మేము కన్ను పూర్తిగాఁ దెఱచినయెడల మీ రట్టె భస్మమగుదురు. అయిననేమి, మా రాజు మీకు వశుఁడై యున్నాఁడు. మే మొక రవంతిముందు బగ్గు మనిపించునరికి లోకైకదీపకమైన మారాజు నుష్ణాని మీరార్పెదరు. తరువాత మీరాష్ట్రమంతను ద్రవ్వి పశ్చిమసముద్రమున మేము పాఱవైచిన నైననేమివినియోగము? నే నిట్లంటినని మీ రేమియు ననుకొనవలదు. మా కళేబరము పెద్దది. మీది యణుమాత్రము. మాముందు మీది కలభము కాలిక్రిందకప్పయంతైనఁ గాదు. ఎంతపెద్దవారమైన నేమి? మా బల మిప్పుడు ప్రకటింపఁదగదు. మాయచే మా రాజును సంగ్రహించకొనిపోవుదమని యోజించితిని. మోసముచేయుటకు మామనసొప్పినది కాదు. ఏదియేమైన నరియే కాని మా రాష్ట్రప్రతిష్ఠపైనబట్టిమచ్చఁ దగుల్చుకొనుటకు మేము సాహసింప లేకపోయినాము. మేమేమియుల్పులమా? బలశూన్యులమా? కాంతలమా? తుచ్ఛమైనజంతువులమా? ధర్మరాజంతవాని నిప్పటి కశ్వత్థామమృతినిగూర్చి తిట్టుచున్నారే. సైంధవవధ దినమునఁ జక్రముచే సూర్యుని రవంత మాయమొనర్చినందులకు శ్రీకృష్ణభగవానునినే పెదవివిఱుచుచున్నారే. కౌరవ పాండవబలములు కొంచెము హెచ్చుతగ్గు సమానములు. మా బలముముందు మీబలము మృగేంద్రముముందు సృగాలమంతయైనఁ గాదే. ఆఁడుపోడుములడఁచిపెట్టుకొని మగయంగీలను దెచ్చికొని యందుపై సన్యాసమును స్వీకరించి మీరు మమ్ము మోసపుచ్చినారు. మీ రట్లు చేసినారని మేము చీర కట్టుకొని

రైక దొడిగికొని జడలబట్టసింగారమును దలపై సంతరించు కొని మిమ్ము మోసపుచ్చునంతటి హైన్యమున కంగీకరింపఁ గలమా? మీకు మగవేసమును ధరించుట కొంతఘనత కాని మాకు స్త్రీవేషధారణము కేవలము లాఘవము కాదా? ఆఁడు వేసములను—

ప—అయ్యో! అంతటితో నాఁగుము. ఆ! ఎట్లు! ఆఁడుది మగవేసమూనుట యాఁడుదానికి ఘనతయా! మగవాఁ డాఁడువేషము ధరించుట మగవానికి లాఘవమా? ఆఁడుది పిఱికిపందయా? మగవాఁడు ధైర్యశాలియా? ఆఁడుది మోసకత్తెయా? మగవాఁడు ధారాళవర్తనుఁడా? ఆఁడుది మగవానికంటె ధైర్యమున సత్యమునఁ దక్కువయని నీ వెట్లు స్థిరపఱిచితివో ముందు చెప్పుము. నిన్ను బద్ధునిఁ జేయుటయో మానుటయో తరువాతఁ జూడవచ్చును.

దా—అమ్మా! ఆ సంగతి నేను స్థిరపఱుపనక్కఱలేదు. మీరే స్థిరపఱిచుకొన్నారు. మీది యొకరాజ్యముకదా యని యెంచి మేము ధైర్యముగ ధారాళముగ మీపై దాడివెడలుదుమని వార్త నంప నరే యని మాకుఁ బ్రత్యుత్తర మిచ్చి మీరేమిచేసినారు? అయిదామడలు మీరు మాయందుకుఁబోయి దొంగమకరము కట్టించి దొంగవేసములు వేసి దొంగపాటలచే నాతని నాకర్షించి దొంగభక్తిచే నాతనిమనస్సు మఱల్చి ఫలములలోనో పానీయములోనో మత్తుమందు కలిపియిచ్చి — ఛీయమ్మా! దుర్గమ్మా! అదినిజమేనా?

దు—నిజమే. అయిన నేమి?

దా—మహారాజునకు మైకమొనర్చి చంక కెత్తికొంచుకొని యిక్కడ కుడాయించి కొట్టులో బీగముపెట్టి సంగనాచులవలెఁ గూరు

చుండినారు. ధైర్యమున కిది లక్షణమేనా? సత్యమునకిది లాం ఛనమేనా? మాకు ధైర్యము లేదు కావున మే మట్లు చేసితిమ నియు, మాకు సత్యము లేదు కావున మే మట్లు చేసితిమనియు మీ సత్యధైర్యశూన్యతను మీ రేస్థిరపఱుచుకొనియున్నప్పు డింక నే నేమిస్థిరపఱుపవలసినది?

రత్నా—(అప) మంత్రీ! సేనానీ! చూచితిరా—బల్లెము తీసికొని గుం డెలలోఁ బొడుచుచున్నాఁడు. కొఱకచ్చుబుచ్చుకొని కన్నుల లోఁ ద్రిప్పుచున్నాఁడు.

మ—(అప) రాజును జంపునెడల నన్ని బాధలును వదలును.

మం—(అప) ఆదివఱ కొనర్చినదే తప్పుగా రాణిగారు పరిగణించి పరితపించుచున్నప్పుడు నీ వట్లనుట తగునా? అమ్మా! మీ రిట్లాతనికిఁ బ్రత్యుత్తర మిందు. (చెవిలోఁ జెప్పును)

స—(అప) అది కొంతబాగుగనే యున్నది (ప్రకా) దామోదర శర్మా! మీ రాజునకు భయపడి నే మాతని నిటకుఁ దేలేదు. మే మాడిన ట్లొప్పుకొనవలసినదని మీ రాజు తనరాయబారిచే మాకుఁ దెలియఁబఱచినాఁడు. తన కెంతబలమున్నను స్త్రీరా జ్యమందుఁ దన కంతయగౌరవము తగదు. తానే గెల్చునని తన కంత తెగనీల్గు తగదు. అట్టిపరుషమాలినమాట తా నాడు టచే నాతని కందులకై తగినశిక్ష యొనర్చి బుద్ధి తెప్పించుటకు నే నట్లు చేసితిని. అంతేకాని, మేము సత్యహీనలము కాము. ధైర్యహీనలము కాము. తప్పుమాట నాడితిమి. జాగ్రత్త. ఒకలు తెలిసికొని మాటలాడుము.

దా—నేను మీ యెడలఁ దప్పాడినట్లు మీరు చెప్పుచున్నారు. కావున న న్నేల శిక్షింపఁగూడదు? ఇదిగో నాయాయుధము ను చాలించినాను. నన్ను బద్ధునిసేయుటకు మీ కిష్టము గా

కున్న యెడల వధింపుఁడు. మహాసంతోషముతోఁ బ్రాణములు విడుతును.

వ—నిన్నుఁ జంపవలసినంత నేరము నీయందు మాకేదియుఁ గనఁబడ లేదు.

దా—అమ్మా! అలాగా? ప్రాణము తీసికొన్నఁగాని ప్రాణము పుచ్చుకొనరు కాఁబోలు! (కత్తి తీసుకొని) ఇదిగో నే నిచ్చెదను మీ సేనానికరము కలిగెనను. అటుపైన నన్నుఁ జంపుఁడు. అమ్మా! మా మహారాజు ప్రాణములు మాత్రము నిరపాయముగ నుండవలెను. (లేచును.)

దు—(తొందరతో) ఎవరక్కడ? త్వరగ భటులు కొంద ఱిక్కడకు రావలయును. (లేచును)

వ—దుర్గా! తొందర యేమియు లేదు. కూరుచుండుము.

దు—అమ్మా! ఈతఁడు తొందరతో మాటలాడుచున్నాఁడు. ఈతనిని జంపుట కనుజ్ఞ నీయవలయును.

దా—సేనాపతమ్మా! నేను కోరున దదియే. శత్రువయ్యును నాకు మహోపకారమును జేయుచున్నావు. రాజ్ఞీమణీ! ఇఁక సందేహింపకుము. మీ కత్తికి నా రక్తమంట నేలయని సందేహము మీకున్న యెడల నిదిగో నాకత్తి—

వ—నిన్నుఁ జంపిన నింద మాకెందులకయ్యా?

దా—ఒక్క మాట మీ రవలీలగ సునాయాసముగఁ జక్రవర్తిని బట్టితిరే. యుద్ధమందా? ఊహు—అతఁడు వెన్నెలలో నిరాయుధుఁడై చల్లగాలికి రాత్రివేళఁ బైని నుత్తరీయమైన లేకుండఁ దిరుగుచుండఁగా మీ రాతనిని బట్టితిరే. మందులసాని కాకినిబట్టుకొనుటకంటె సులువుగ నాతని బట్టుకొంటిరే—ఇంతకాలమునుండి యుద్ధములు జరుగుచున్నవి కదా! యుద్ధతంత్రమును

గూర్చి యింతశాస్త్రము న్నదికదా! మనపూర్వులెవ్వరైన గం
జాయినీరు కాని గసగసాలసారము కాని కదనతంత్రములం
దుపయోగపఱచిరని వినియుంటిరా! ఇది మీనాఁడు కలిగిన
విచిత్రకల్పనము కాదా ? మహారాజులకుఁ బ్రక్కలలో మగు
వలను వేసియో గొంతుకలో మసిడికషాయము పోసియో
వశపఱచుకొనుటయే ప్రధానమా ? ఎట్లో యొకట్లు మహా
రాజు దొరకెనుగదా యని యాతని దెచ్చి బంధింతురా? ఇంక
మీకు బాణము లెందులకు భల్లము లెందులకు ? రసకర్పూ
రపుసీసాలను వజ్రభస్మములను మూటగట్టుకొని దిగ్విజయ
మొనర్పుఁడు. ఇకముందు వారి కెల్లండునో కాని యిప్పటివ
ఱకు మనకు మహారాజు విష్ణుతుల్యుఁడు కాఁడా? నాయెదుట
వెల్గుచున్న మీమహాజ్యోతీరూపమునకు నేను నమస్కరించు
చున్నానే — మీరుమాకు శత్రువులైననేమి ? మీమూర్తి
యందున్న దివ్యమహిమకు మేము సాష్టాంగపడక తప్పునా ?
మీవంటివాఁడేనా మామహారాజు. మీరు ప్రభువులైయుం
డియు మీరే మఱియొక్క మహాప్రభుని గౌరవమును బాటిం
పకుండుట తగునా? మీలో మీకు శత్రుత్వ మున్నది కాని
మీయిద్దఱ తేజముకూడఁ బరమాత్మ తేజమే కాదా ? నేను శ
త్రుఁడనైనను మీరు నన్ను ధారాళముగ లోనికి రమ్మనినారు-
నేను మీయెదుట రెండుబారలదూరములో నున్నాను. ఈ
యవకాశమును దీసికొని నాచేతిలోని కత్తిని యీధాలాభ
ముగ విసరి మీగొంతు నఱుకవచ్చునా? నేనట్లు చేయునంతటి
తుచ్ఛుఁడనా ? మీతురాపైనున్న కొంగయీకలో నొక్క
తూలికమైనఁ దెగకొట్టుట నాతల యెగిరిపోవుట మంచిది
కాదా? మామహారాజునకుఁ గల్గినబాధచేఁ బరితపించు నే

నాత్మహత్య చేసికొని పాపము కట్టుకొనుటకంటె శత్రురాజు చేఁ జచ్చి పుణ్యము౦పుట శ్రేష్ఠమని భావించి మిమ్మాశ్రయించితిని—రక్షింపుము అనఁగ శిక్షింపుము.

స—సరే నిన్నుఁ జంపెదననుకో- అటుపైన మీసేనను మిగిలినవారేమిచేయుదురో?

దా—పుణ్యాత్మురాలా! సంతోషము. మాసేన యిదివఱకే అనఁగ మారాజు కానఁబడకపోవుటచేతనే కొంత చెల్లచెదఱయినది. నేఁడో రేపో మిగిలినసైన్యము బయలుదేఱి మారాష్ట్రమును జేరును గాఁబోలు.

స—అటులైన మీరు మాతో యుద్ధమునకు రా నేరారా?

దా—అమ్మా! ఎక్కటఁబడి యుద్ధమొనర్చువారితో యుద్ధము కాని విషాదిపుష్పములను సూత్రులలోఁ గలపి గౌరీపాషాణమును గోదమపిండిలోఁ గలిపిచాటునఁ గూరుచుండి మారణకర్మ మొనర్చువారితో మాకు యుద్ధ మెందులకు? ఇంతకును మారాజు మీయొద్ద నుండ గా మే మెట్లు యుద్ధము చేయుదుము?

స—మీరాజును మీ కిచ్చివేసినయెడలఁ జేసెదరా!

దా—చేయుటకేమమ్మా? యుద్ధమారంభించినతరువాత యుద్ధభూమిలో మీరు మాయెదుటఁబడి యెంతమోసముచేసినను సహింపఁగలము కాని, మే మిక్కడకు ముప్పదిమైళ్ళదూరములో మా శిబిరములనడుమ యుద్ధచింతయే లేకుండ వినోదించుచుండఁగ మాకు విషప్రయోగము చేయవచ్చునా? మీరు తలఁచుకొన్నయెడల నిట్లు మీ రెండవరాజులకు విషము పెట్టలేకుందురు? రాజు గొప్పవాఁడన్నమాటయేకాని యతనిప్రాణముమాత్రము పుట్టెఁడా గరిసెడా? పర్వతమా పాషాణమా? రాజు వంటవానినో వారాంగననో వైద్యునో యొకచిన్నగ్రాసు

మిచ్చెదమని యాకర్షించుట—ఉల్లంగిపిట్టకూతలో పల్లిపా
షాణమో స్తంభనలేహ్యములో శంఖపాషాణమో వేసి యి
ప్పించినయెడల శత్రురాజెక్కడ ధామ్—జయభేరీలతో మీ
రెక్కడ ధామ్—

శ—పిశేమపరిసంగ మేల? మీతో యుద్ధముచేయవలయునని మా
కుఁ బూర్ణమైన వాంఛ యున్నది. మీరాజును మీకిచ్చెదము.
చేసెదరా ?

దా—అమ్మా! ఇప్పుడు చెప్పిన దామాటయే కాదా ?

శ—మీ రెప్పుడు యుద్ధమునకు వచ్చెదరు ?

దా—కొంతసేన సమీపముననే యున్నది కావున దానిని దీసికొని
పదిదినములలో రాఁగలము.

శ—ఎంతసేనతో వచ్చెదరు?

దా—ఎంతసేనతో రమ్మందురో అంతసేనతోనే వచ్చెదము.

శ—మాకుఁ బదివేలకంటె నెక్కువసైన్యము లేదు మీ రెట్లేగి యుం
డవచ్చును. మీరు ముప్పదివేలసైన్యముతో రావచ్చును. అం
తవఱకు మేము నిగ్రహింపఁగలము.

దా—మీమీఁది కంతసైన్యముతో వచ్చుట మా కప్రతిష్ఠ కాదా ?
లేఁగదూడమీఁది కాఁబోతు పోవుట లేగకుఁ బ్రతిష్ఠయేమై
నను నాఁబోతున కపయశమే కాదా ? కావున మేము మీ
తో సమానముగఁ బదివేలసైన్యముతో వచ్చెదము.

శ—మీరు ముప్పదివేలతో రాకతప్పదు. తగ్గించివచ్చునెడల మీరా
జును మీకీయము మీతో మాకు యుద్ధమక్కఱలేదు.

దా—ముప్పదివేలన్న నియమ మెందులకమ్మా!

శ—ఎందులకో చెప్పనా? ఒక్కయాఁడుది ముగ్గురుమగవాండ్రనూచి
పుచ్చుకొని చావగొట్టగలదని లోకమునకు ఋజువుచేయుట

కు—తెలిసినదా? బలిష్ఠుల మని తామే శౌర్యవంతుల మని తామే యుద్ధనైపుణ్యము కలవారమని మగవారికున్న పొగరుబోతుఁదనము తెగనీల్గుఁదనము నిప్పటి మాదెబ్బతో నగిరిపోవలయును పిఱికిదాన వని నన్నుఁ దిట్టుము. నేను సహింతును. మోసకత్తెవని నన్నుఁ దిట్టుము. అంతేకాని నాజాతిని దిట్టెదవా? సృష్టి కాధరణమైన స్త్రీతత్త్వమునే నిందించెదవా? స్త్రీనింద చేసినవాఁడు తనతల్లిని దాను నిందించుకొనినట్లు కాదా? తనతోఁ బుట్టువును నిందించు కొనునట్లుకాదా? తన భార్యయే తన కెదురుతిరిగి బుద్ధిచెప్పదా? దామోదర శర్మా! శరీరాకృతియే నీతండ్రిది కాని నీయంతస్తత్త్వము నీతల్లిదే కదా—ఈమాత్రపుఁ బ్రకృతిజ్ఞానమే నీకు లేదేమి? నీవు మహాకవివఁటే. మీయాస్థానములో నీవే ప్రధానకవివి కాఁబోలు- నీస్వభావజ్ఞానమే యింత చట్టుబండలైపోవఁగ మిఁగిలినవారికి స్త్రీపురుషజ్ఞానమైన నున్నట్లగపడదే—మీశౌర్యముతోనే గాని మీబుద్ధులతో మాకేమి పనియున్నది? మాశౌర్యము మీశౌర్యముకంటె ఘనమని ప్రకటించుటకే మీతో యుద్ధము. మిమ్ము నేమే గెల్చుట సిద్ధించినయెడల "స్త్రీజాతియే మిగుల శౌర్యవంతి"మని మా విజయము నీయాకాశముపై నేఁడు కల్గిన తోఁకచుక్కను సూర్యతేజస్సులో ముంచి పంద్రెండురాసులలోను బంద్రెండుదివ్యాక్షరములను వ్రాసెదము. యుద్ధ మెంతశీఘ్రముగ నగునో నీసత్య మంతశీఘ్రముగఁ బ్రకటింపఁబడును గావున మీరెప్పుడు యుద్ధమునకు వచ్చెదరు?

దా—ఎప్పుడో యననేల? పదిదినములలో వచ్చెదమని మనవిచేసితిని గాదా?

వ.—నీవు చెప్పినమాట జ్ఞప్తియుండక నే నడుగలేదయ్యా! ఎందుల కని యిప్పుడు నే నూరకుంటిని. రెండవసారికూడ నంటివి. ఇప్పుడు నీతప్పేదో చెప్పకుండు నెడల నాది తప్పగును. యుద్ధమునకు వచ్చెదనని కాని రానని కాని యనుటకు నీ కధికారమున్నదా? నీవు మంత్రివి కాని కాశ్మీరరాష్ట్రప్రభుఁడవు కావే! నిన్ను నే నడిగినప్పుడు "అమ్మా! మామహారాజును గనుఁగొనకుండ నే నెట్లు చెప్పఁగల"నని నీ వనవలసినది కాదా? ఆఁ, ఎంతవాఁడవైతివి. రాజవే నీవని యనుకొనుచుంటివే. నీ మాట నీరాజు వినువాఁడే యైనను నీవు మాటవరుసకైన నాతని గౌరవమును దక్కింప నక్కఱలేదా? నీబుద్ధివలన నే ఘనకార్యము జరిగినను నది రాజువలననే జరిగినట్లుగా నీవు చెప్పవలసినదే కదా! మంత్రినని చెప్పుచున్నావే—మహావిద్వాంసుఁడవని వినుచున్నామే—మంత్రి ప్రవర్తన మిట్లే యుండవలయు నని మీరాజనీతిశాస్త్రము చెప్పుచున్నదా యేమి? మందాకినీ! మనవైపు రాజనీతి యెట్లున్నదో యాతనితోఁ జెప్పుము.

మం.—చిత్తము.

దా.—అమ్మా! అక్కఱలేదు. రాజనీతిశాస్త్రము మీవైపుదొకటియు మావైపుదొకటియునా? నాది తప్పయిన క్షమింపఁదగును. మీపై యుద్ధమునకు వచ్చెదనని మామహారాజిప్పటికే వార్తనంపినాఁడు. కావున నావార్త ననుసరించి తప్పక యిప్పుడు వచ్చునను ధైర్యముతో నే నట్లంటినే కాని నేను స్వతంత్రుఁడ నను గర్వముతో నట్లనియుండలేదు. అమ్మా! నేను భటుఁడను. మేము తెల్లవారి చేయుచున్నవన్నియుఁ దప్పులే. చదువుకొన్న రాజనీతిశాస్త్రము నేను పరాకుపడినఁ బడియుండవచ్చును.

బుద్ధిపూర్వకముగనైన నుల్లంఘింపవచ్చును. అట్టితప్పులోనర్చు ట భటులమైన మాతలవారిత. మీరు ప్రభువులే- ప్రజాశాసకులే- దోషశిక్షకులే- ఎప్పుడో యుద్ధమునకు రాఁబోవు రాజునకు నడిదారిలో మత్తుమందు పెట్టుమని యారాజనీతిశాస్త్రమున యుద్ధప్రకరణమం దున్నదేమో మంత్రిచేఁజదివింపుఁడు.

వ—ఆ- లేదనుచున్నావా? సరిగా మే మొనర్చినట్లు లేకపోవచ్చునేమో- కాని శత్రుభూపతి దారిలోపల వృక్షములు నఱికివేయవలయుననియు, గోతులు త్రవ్వింపవలయుననియు, గుఱ్ఱములకు గడ్డి దొరకకుండఁ దగులఁబెట్టింపవలయుననియు నూతులలోఁ జెఱువులలో విషక్రిములు గలపవలయుననియు మొదలైనన గతులు లేవా? అదిగాక మాపై యుద్ధమునకు వచ్చెదనని యిదివఱకే మీరాజు వార్తనంపియుండుటచే నీవు యుద్ధమునకు వచ్చెదనని స్వతంత్రించి చెప్పితిననుచున్నావు. అది తప్పు. మా దెబ్బచేఁ జావుతప్పి కన్నులొట్టబోవుస్థితిలో నిప్పుడున్న మీరాజు మాతో నిఁక యుద్ధమునకు వచ్చుటకు వెనుదీయునేమో. నీవు పోయి నేఁజెప్పినసంగతులు మీరాజుతోఁ జెప్పి ఆయనయభిప్రాయమును గనుఁగొనిరమ్ము మంత్రీ! నీ వాతనితోఁగూడఁ బొమ్ము కారాగృహాపుఁదాళములు నా పడకగదిలో నున్నవి చపల నడిగి తీసికొనుము.

(దామో-మందా-నిష్క్ర)

దా—మహారాజును వదలిపెట్టెదరా?

వ—మనయపకీర్తితోఁబాటు.

దా—మనపదివేలు వారి ముప్పదివేల నెదుర్కొనఁగలవా?

వ—నీవు సర్వకార్యములయం దప్రమత్తవై యుండవలయును. మన

కోటరు వారు ముట్టడించుటకంటె మనమే వారి నుచితస్థలమున నెదుర్కొనిన మంచిదనుకొందును.

దా—అమ్మా! అటు లెన్నడు వలదు. అది యుపద్రవమునకుఁ గారణము.

శ—సరే- ఆసంగతి తరువాత నాలోచింపవచ్చును.

[దామో-మందా-ప్రవే!]

దా—అమ్మా! మహారాజును దర్శించితిని ఆతనితో నన్నిసంగతులు మనవిచేసితిని.

శ—మందాకినీ— ఆతఁ డేమనెను.

మం—ఆతఁ డన్నియేర్పాటుల కంగీకరించినాఁడు.

శ—ముప్పదివేలసైన్యముతోడనే వత్తునన్నాఁడా ?

మం—అందుల కంగీకరించినాఁడు.

శ—దామోదరశర్మా! నీవు మీమహారాజును దీసికొనిపోవచ్చును. మంత్రీ! ఆయనను విడుదలచేసి గౌరవపూర్వకముగ వారిశిబిరమునొద్దకుఁ బంపుట కేర్పాటు లొనర్పుము పొమ్ము

దా—అమ్మా! నాకు సెలవు దయచేయుఁడు.

శ—మీరాజుగారిని నే నిప్పుడు చూడనొల్లను మే మొడిపోయిన ట్లొప్పుకొనవలయునని యాతఁడు మాకు నిర్దాక్షిణ్యముగ, బంపిన వార్త శూలపుఁబోటువలెఁ బ్రక్కను వేధించుచున్నదని చెప్పుము. విల్లెక్కు-పెట్టి యాతనికరము డుసివోవఁ గొట్టునప్పుడే యాతని మొగమును జూతు నని చెప్పుము. ఇదివఱ కాతనిమొదల జరిగించిన లోపమును క్షమింపుమని చెప్పుము, త్వరలో రావలయునని చెప్పుము. తీసికొనిరాఁదలఁచిన ముప్పదివేలభటుల నన్నికవారినే తీసికొనిరమ్మని చెప్పుము. మే మిప్పు డాతనిని వదలిపెట్టి ప్రాణరక్షణ మొనర్చితిమికదా

యను దాక్షిణ్యము కాని కృతజ్ఞత కాని మాయందు లేశ మైన లేకుండ మాతోఁ గ్రూరముగ భయంకరముగఁ బోరా డుమని చెప్పుము. ఇంతకంటెఁ జెప్పవలసిన పని లేదు. ఇఁకఁ బొమ్ము మంత్రి! నీ వాతనితోఁ బొమ్ము. మహారాజున కుత్తరువు తాంబూలము నిచ్చి మారాణి మీకు నమస్కరిం చినదని చెప్పుము. నీ వాయన నూరుబైటికి సాగనంపి యాత నికి నమస్కరించి సెలవు తీసికొని రమ్ము దుర్గా! నీవు నీ బసకుఁ బొమ్ము. త్వరలో నన్నియంశములు మాటలాడు దము.

(మంత్రి, దానొా, దుర్గ, నిష్క్రమింతురు.)

పద్మా—చపలా!

[నేపథ్యమున] అమ్మా!

పద్మా—పడ్డన మోనర్పు మని చెప్పుము.

[నేపథ్యమున] సిద్ధముగనే యున్నది.

పద్మా—అట్లైన వచ్చుచున్నాను.

(నిష్క్రమించును)

ఇది చతుర్థాంకము.



శ్రీ

# చూడామణి

## పంచమాంకము.



ప్రదేశము:—స్త్రీరాజ్యమునఁ గోట యెదుట.

[ప్రవేశము:—వికటుఁడు వామనుఁ డను వినయాదిత్యుని భటులు]

విక—ఇంత కాలమునుండి యుద్ధములు చేయుచున్నామన్నమాటయే కాని, దీనిసిగఁదరగ! యుద్ధమునగ నెప్పటికప్పుడే భయము కాని పౌరుష కలిగినది కాదేమిరా?

వా—నిజమైన మాట విను. పౌరుషయన్నది యెవ్వరికిని లేదని నమ్ము. సేనాధిపతికిమాత్ర మున్నదనుకొన్నావా యేమి? పట్టిది. రాజుగారి కంతకంటె లేదు మనలను ముందునకుఁ ద్రోచి వారు దూరముగా నిలువఁబడుదురు. చావనఁగ నందఱకు భయమే. తాగుడుమత్తుచేతను రూకలమోహముత వలనఁ గలిగిన యావేశముచేతను ముందునకుఁ బోవుట కాని పౌరుష మెవరి కున్నదిరా?

విక—నామనస్సునకు నచ్చినట్లు చెప్పినావురా.

[నేపథ్యమున] అమ్మయ్యో! బాబయ్యో! నలిగిపోయితిమిరా! చచ్చితిమిరా! అవిగో పడెరా! పాషాణములు పడెరా! తప్పకొనరా! అయ్యయ్యో! దేవుఁడా! దేవుఁడా!!

(గొప్ప ధ్వను లగును)

వా—వికటా! చూచితివా? కోటబురుజులమీఁదినుండి తాళ్లు మన సేనమీఁదికిఁ బడఁద్రోయుచున్నారు. అయ్యయ్యో! ఎందఱు నలిగి చచ్చుచున్నారో!

[నేపథ్యమున] పద్మావతి రాజ్ఞీమణికి జయా! (జయఘంటలతో ధ్వను లగుచున్నవి)

విక—వింటివా! ఇక్కడకు మనసేనలో ముందుభాగ మందఱు కడతేఱినట్లు శ్రీరాజ్యమువారు జయజయధ్వానము లిచ్చుచున్నారు.

[నేపథ్యమున] వెనుకవారు ముందునకుఁ బొండు ఇంకఁ జూచెద రేమి? పొండు—క్రిందఁబడిన శవములను ద్రొక్కుకొని పొండు—పెట్టుఁడు కేకలు పెట్టుఁడు జయా! వినయాదిత్యమహారాజునకు జయా!—(జయా వినదిత్య మహారాజునకు జయాయను గొప్ప కేక లగును.)

వామ—ఇప్పుడు మనవారు తిరుగ ముందునకు విండ్లతో బురుజులమీఁదివారిని గొట్టుచున్నారు.

[నేపథ్యమున] ఆద్దీ! ఆద్దీ! సెబాస్! బాగుగాఁ గొట్టినారు కొబ్బెరపుచ్చెలూడునట్లు బురుజులమీఁదివారి తలలు నేలను రాలుచున్నవి వహవ్వా తలలవర్షము! జయా వినయాదిత్యమహారాజునకు జయా! (చప్పటలతో మహాధ్వను లగును.)

విన—అటుచూడు. కోటమీఁదివా రెందఱు కూలుచున్నారో!

[నేపథ్యమున] అరెరే! మంట-మంట-బాబూ మంట—చచ్చితిమిరా చచ్చితిమిరా! కాలిపోతిమిరా! అయ్యయ్యో! దాహము—దాహము—తాపము—తాపము! ఓ ఓ-ఓ-

(పెద్దయేడ్పులు.)

వామ—కాచినసూనె గూనలకొలంది స్త్రీరాజ్యమువారు క్రిందికి దిమ్మరించుచున్నారు.-మనవారెట్లు మాడిపోవుచున్నారో— అయ్యయ్యో!

[నేపథ్యమున] జయా! కాంతాశిరోమణికి జయా! జయరమాసంగ్రహణవిశారదకు జయా! వీరావతారమునకు జయా!

(జయఘంటలతో ధ్వానములగును)

వికట—వింటివా! స్త్రీరాజ్యమువారెట్లు తుళ్లిపడుచున్నారో!

వామ—మిట్టిపాటెంత—మట్టిపాటెంత—రవంతసేపటికి వారియేడ్పులుమాత్రము మనము వినకుందుమా?

[నేపథ్యమున] ఉద్భటభట్టా! ఉద్భటభట్టా! సేనలు వెనుకకుం బోవుచున్నవి. పురికొల్పుము. (ఈలలెన్నియో ధ్వనియగుచున్నవి)

వికట—వామనా! ఈలలు మ్రోగుచున్నవి. భటులు వీరావేశమునకై రుంజలింక వాయించెదరు. నాకు రుంజలు వినంగం బ్రేగులదలిపోవును దామోదరశర్మ యుద్భటభట్టును బ్రోత్సహించుచున్నాఁడు. అదిగో ఉద్భటభట్టిక్కడకు మఱలుచున్నాఁడు. మనలఁజూచినయెడలఁ గొట్టునేమో- పోవుదము.

(నిష్క్రమింతురు.)

[ఉద్భటభట్టుఁడు శంఖమునబూరించుచుఁ బ్రవేశించును.]

ఉద్భ—సీ. నేపాలదేశావనీపాలదోర్గర్వ
నిర్వాపణక్రియా నిపుణులార!
ధారాధరాధీశ భైరవాసీకినీ
విచ్ఛేదనకళాప్రవీణులార!
మాగధేయావనీ భాగధేయాఖండ
వాహినీఖండన ప్రబలులార!

సింధుదేశాధీశ । గంధసింధురకుంభ
దారణదారుణ । ధీరులార!
ఆంధువారికంటె । నాఁడువారైతిరే
తిరుగఁ డింక మరలఁ । దిరుగ రేల ?
నెచటనున్ననైన । మృతి తప్ప దాహవ
మందుఁ జచ్చి కీర్తి । నందరాదె?

ఆ. వె. విభునిప్రేమ నిట్లు । పెరిఁగినదేహంబు
లతని యవసరమున । నతని కిచ్చి
ఋణము తీర్చుకొనక । యెచటి కేగెదరు ఛీ!
ద్రోహులార! । పరమ తుచ్ఛులార!

ఆ. వె. స్త్రీలచేత నిట్లు । చెప్పుదెబ్బలు తిని
సిగ్గు లేక యిల్లు । సేర మీదు
మగువ లేవగించి । మొగముల నుమియరే
బహుగులార! పిఱికి । పందలార !

జయా ! వినయాదిత్యమహారాజునకు జయా !! యని కేకలు
పెట్టుఁడు. (శంఖము పూరించును)

[నేపథ్యమున] జయా ! వినయాదిత్యమహారాజునకు జయా!! (యను
ధ్వనులు.)

ఉద్భ—సెబాస్- రణయోధులారా ! తీవ్రపౌరుషమునఁ దిరుగఁ
గోటపై దుముకుచున్నారా. వహావ్వా! వహావ్వా ! ఎక్కడో
నుఁడు. మీ రిప్పుడు మీతండ్రిల పుత్రులై ప్రకాశించు
చున్నారు.

సీ. గంగాతరంగిణి । కడుఘోరముగఁ బొంగి
. ప్రక్కచేలను బాడు । పఱచునట్లు

చండధాటీయుక్త । ఝుంఝూనిలము రేగి
విపినపాదపముల । విఱుచునట్లు
భీకరోద్రేక మహా । భూకంప ముదయించి
ద్వీపంబులను ముంచి । వేయునట్లు
ప్రళయాగ్నితుల్య మహా । వహ్న్యాశైలము బ్రద్ద
లయి దేశములఁ గాల్చి । వయిచునట్లు
గొల్లుమని యొక్కుమ్మడిగ । గ్గోలుపెట్టి
కోటఁ గూఁకటివ్రేళ్ళతోఁ । గూడఁ బెకిలి
చెఱచి విఱచి బూడిదచేసి— । సింధువందు
వేగ కలుపరె వీరాధి । వీరులార !

[నేపథ్యమున] గునపములు గొడ్డళ్ళు- తెండు తెండు. ఊఁ — ఊఁ ద్వారములు పగులఁగొట్టుఁడు. (గొప్పధ్వను లగును)

ఉద్భ—మహావ్వా ! మనవారు కోటద్వారములను ద్రవ్వ యత్నించుచున్నారు. అదిగో!

గీ. ద్వారవిచ్ఛేదకభటాలి । పైని ప్రక్క-
జుమ్మనుచు స్త్రీలశరకోట్లు । క్రమ్ముకొనియెఁ;
దేనెపట్టును మనుజుఁడు । తీయఁబూన
మక్షికలు గుంపులై కుట్టు । మాదిరిగను.

రణయోధులారా! గునపములకు గొడ్డళ్ళకు స్వాధీనమగునట్లు తోఁచదు. మందు తెచ్చి దట్టించి పగులఁగొట్టుఁడు. త్వరగఁ దెండు.

[నేపథ్యమున]- మందు మందు- త్వరగ- మందు త్వరగ- చూచెద రేమి? (అనుధ్వనులు)

ఉ—మహావ్వా-మందుతట్ట వచ్చుచున్నది. కాని యాహాహా! అదేమి, అదేమి !

గీ. అలుగుచివరను గొరకచ్చు । వెలుఁగుచుండ
బాణ మొక్కటి పైనుండి । వచ్చి యకట!
భటునితలమీఁదిలిట్టలో । భలను బడిరొ
పాఁధుతలపైని దాడిల్లి । పామువలెను.

[నేపథ్యమున] అయ్యయ్యో- చచ్చితిమి. చచ్చితిమి. హా హా! ఇఁక నేమున్నది- మంటలు- మంటలు- (గొప్పధ్వనులు)

[మఱియు నేపథ్యమున] జయా! పద్మావతిరాజ్ఞీమణికి జయా! జయా! పురుషసేవావిచ్ఛేదనపరాయణకు జయా! (జయఘంటలధ్వను లగును.)

ఉ — ఇఁక నేమున్నది- ఎందఱో చచ్చినారు. నేను కోటముందు నకుఁ బోయి భటులను హెచ్చరించెదను.

(నిష్క్రమింపఁగ — వెనుక తెర యెత్తఁబడును.)

[కోటబురుజులపై మందాకిని, చపల, పద్మావతి, దుర్గ ప్రవేశింతురు. క్రింద కొందఱుభటులు కోటద్వారమును దిప్పుచుందురు.]

1 భటు — వెనుకవారు ముందునకు రండు- త్వరగరండు. మే మిక్కడఁ బడి చావవలసినదా యేమి?

[నేపథ్యమున] వచ్చితిమి. మీరు ద్వారములు త్రిప్పుచుండుఁడు.

2 భటు — కొట్టు — గొడ్డలితోఁ గొట్టు —

3 భటు — ఊ- ఊ- ఊ ఉ (అందఱు గునపములతోఁ బొడుచుట నభినయింతురు.)

మం — రాజ్ఞీమణీ! కొఱకచ్చు మందుతట్టలో సరిగఁబడునట్లు మీ రెంతసూటిగఁ గొట్టినారు!

ప — అన్యోన్యస్తోత్రపాఠముల కిది యవసరము కాదు. దుర్గా! చపలా! మీరు పురుషవేషముల ధరించి పాతాళగుహలో దాఁచి యుంపఁబడిన యిరువదినాల్గువందలభటులలో మీరిద్దఱు

చేతియొకసగమును దీసికొని రహస్యగుహాద్వారము నుండి వెలుపలఁబడి కోటవెనుకనుండి యొకరు దక్షిణముగా నొక రుత్తరముగా వచ్చి, వినయాదిత్యునిసేనాపతులను డబ్బా టుగ నదిర్చి క్రిక్కిఱియఁజేసి వధింపుఁడు. మే మీగోడలచా టున డాఁగి, మిగిలినసైన్యముతోఁ బైనుండి యవసరానుసార ముగాఁ బనిచేయుచుందుము. నేనుచెప్పినది తెలిసికొంటిరా ?

దు-చ—చిత్తము.

ప—అటులైనఁ బొండు. (దుర్గ చపల నిష్క్రమింతురు)

మందాకినీ! అదిగో శత్రుసైన్యము. తిరిగి రుంజలరవముతోఁ గోట యొద్దకు వచ్చుచున్నది.

[పెద్దధ్వనులతో జయజయధ్వానములతోఁ గోటయెనుటి కుద్భట భట్టు, దామోదరశర్మ సైన్యముతోఁ బ్రవేశింతురు.]

దామో—చమూయోధులారా !

ఆ. వె. అఁదు వారిమీఁద । నధికధాటిని జూపఁ
దగదటంచుఁ గొంత । తగ్గుచుండ
మీరు భీరు లనుచుఁ । ధీరలు తా మంచు
నెగసిపడుచు నుందు । రింతు లెంతొ.
తరుణులందు మీరు । దాక్షిణ్యమును వీకి
కృమ్మి చంపవలయు । గోటఁ జీల్చి
భల్లుకంబు పుట్ట । పైఁబడి పెకలించి
చెదలఁ జీమగములఁ । జిమునట్లు.

(కోటబురుజువంకఁ జూచి) ఓమందాకినీ! ఇదిగో చెప్పుచున్నాను విను. మా సేనలన్నియు సమకూర్చుకొని కోటను ముట్టడించినాము. మామందుదెబ్బచేత మీకోటఁ ద్రాగినవానివలె నూఁగియూఁగి నేలఁ గూలునట్లు చేయఁదలఁచినాము. ఇదివఱ కుపేక్షాభావ

మున నూరకుంటిమి. మీబుద్ధిహీనతవలన మీపెంకితనము వలన నెన్ని ప్రాణులో పోఁదలంచి యున్నవి. ఎంతరక్తమో నేలను దడుపవలసియున్నది. అనావశ్యమగుజీవనాశన మింక ముందుఁ గానీయవలదు. మీకోటను మాయధీనముచేసి మీ ప్రాణములను దక్కించుకొని మీసేనలను గాపాడుకొనుఁడు- నేను చెప్పినది వినఁబడినదా ?

మం—ఆ- ఈకోటను మీరాజు నధీనముచు జేయుమని చెప్పుచున్నావు. దీనిని మేము నీకు స్వాధీనపఱచు నెడల నీ వెందులకు? నీ రా జెందులకు ? ఇంతసైన్య మెందులకు ? అన్నియు విడనాడి నీరాజు కోటముందుకు వచ్చి "అమ్మా ! నే నీకోటను జయింపఁజాలను- బలహీనుఁడను- బుద్ధిహీనుఁడను-ఈకోటను నా కిమ్మని చేతులు జోడించుకొని మా రాణిగారిని దైన్యమున యాచించునెడల నామెచిత్త మెట్లుండునో, నీరాజుభాగ్య మెట్లుండునో ?

దా—నీబుద్ధికిఁ దగినట్లు ప్రత్యుత్తర మిచ్చినావు. నీతో నట్లుపలుకుట మాదియే పొరపాటు.

ప—ఇట్టిపొరపాట్లు మీ రనేకము లొనర్చినారు. ఇది మీకిది మొదటిది కాదు. యుద్ధారంభపూర్వమునఁ బలుకవలసిన యీమాట లిప్పు డెందులకు? కొంతయుద్ధ మైనతరువాతనా యీ మాటలు! కోఁకలిబాడలవలెఁ గోట కెగఁబ్రాఁకినవారు నేలఁగూలి వండ్లు విఱుగఁబడఁగా- మా కోటపైనుండి పడినఱాలచే నలిగినవారు నలగఁగాఁ- గ్రాఁగిననూనెచేఁగాలినవారు కాలఁగా-మంటకపోణకలు మండుటచే భస్మమైనవారు భస్మముకాఁగా-గాయములచే నేడ్చినవా రేడ్వఁగా, నిప్పుడా సామగానకాలక్షేపము! ఇదివఱకుజరిగినపోరాటములో మీపరాక్రమ మేదో మాకుఁ దెలి

యనే తెలిసినది. బుద్ధిలేక యేల యిట్లు వెల్లడిపడుచున్నారు? తప్పు కాదా? చేతిలోఁ గత్తి భుజముపై విల్లు మూఁతిపై మీసము గలిగియుండియుఁ బాపునకు జడియుదు రేల? అబలల మని మీచేఁ దృణీకరింపఁబడిన మేమే పిచ్చుకగూడంతకోటలోఁ బెద్దపులులవలె మిమ్మెదుర్కొనుచుండఁగ— హాహాహా! దిగ్విజయయాత్రకై బయలుదేఱిన మీరు— ఏకచ్ఛత్రాధిపత్యము నపేక్షించిన మీరు— ఏ మొగముపెట్టుకొని యిట్లు పలికితిరి? భగవంతుఁ డిచ్చినపౌరుషము మీలో లేశమైన నున్నయెడల, బుద్ధిలేక స్త్రీలపై దాడివెడలితిమికదా వారిని గెలువకుండుటకంటెఁ జచ్చుటయే మంచి దన్నలజ్జ మీలో నేమాత్రమైన మిగిలియున్నయెడలఁ దిరుగఁ గోటపైఁ బడుఁడు. మమ్ముఁ జంపుఁడు. అటుపైని గోట స్వాధీనపఱచుకొనుఁడు.

దా— అభ్యంతర మేమి? అందుకు సిద్ధపడియే కదా వచ్చితిమి.

1 భటు— వింటివఁటరా! ఆఁడుకూఁతు రెంతబిఱకముగాఁ జెప్పినదో?

2 భటు— నేనుచెప్పినమాట విను. మగముండకొడుకుమీఁదఁ దిరుగఁబడినతరువాత నిఁక నాఁడుకూఁతు రేమిటిరా నీ మొగము.

3 భటు— అది కాదోయి పెద్దన్న. ఆఁడుది పుట్టుట యెందుకనుకొన్నావు. మగవానిమీఁదఁ దిరుగఁబడుటకే ఆమాట చెప్పవద్దు— కోటగోడచాటునఁ గూలఁబడి యెన్నిబిఱకములైన నాడవచ్చును. ఇందులోనున్న యాయువు ట్టిది ఏదీ! కోట దిగి యెదుటఁబడనీ! నాతిమూపా! మిడుపకుడుమును మ్రింగినట్లు మ్రింగకపోయినయెడల గునపముతోఁ బొడుచు.

దా— భటుఁడా! నీ విప్పుడు పౌరుషవంతుఁడవై ప్రకాశించుచున్నావు. ఏదీ భటులారా! పొడువుఁడు. కోటద్వారము పొడువుఁడు. ఎక్కుఁడు— కోటగోడల నెక్కుఁడు. ముందు దట్టించుటకుఁ బ్ర

క్కలను గోతులను దవ్వుచు—పాటచే నుత్సాహ మధికమ
గును గావునఁ బాడుఁడు.

అంద—జయా విజయాదిత్యమహారాజునకు జయా !

[నేపథ్యమున రుంజలు మ్రోఁగును.]

అంద— గీతము.

పాడువరా - పాడువరా - గట్టిపాటు పాడువరా॥
మిన్ను విఱిగి పడిన సరియె - మన్ను ఱ్ఱిగి పడిన సరియె
కన్నుమూసి తెలిచులోన- యున్నయమ్మెఁ గోటయునుఁడు॥ పాడు॥
పడఁతిచేత దెబ్బఁ దినుచు - బ్రిదికి విల్లు కట్టుకొంటె ।
మెడకుఁద్రాడు చుట్టుకొనుచు-గుడుకుమనుట మేలు మేలు॥పాడు॥
గరిటకాడఁ బట్టఁదగిన- కాంత కత్తి పట్టినపుడు
పురుషమూతిమీసలెల్లఁ - బురుగు నాకిపోయినట్లు॥ పాడు॥
ఆఁడుదాని జంపినాఁడు - ఆంజనేయుఁ డంతవాఁడు
కోడిగొంతు నులిమినట్లు - కొమ్మఁ జంపఁ బుణ్య మగును॥పాడు॥

[నేపథ్యమున ధూమ్మని ధ్వనియగుచున్నది.]

ఉ—మఱేమియుఁ దొందరలేదు. కోట నెగురఁగొట్టుట కానైపునఁ
బనిచేయుచున్న మనవా రఁటించిన మందుధ్వని గాని మఱియొ
కటి కాదు. వహవ్వా ! ఇంక నాల్గుదెబ్బలతోఁ గోట యూడి
పడును

వ—మనము పంపిన దుర్గాచపల లింక సేనలతో శత్రుసేనాపతులముల
నింక నెదుర్కొనలే దెందువలననో ?

మం—ఏదీ ? ఇంక వ్యవధి చాలదు.

వ—నీ వాగోడచాటుననుండి బాణములను విడువుము. నే నీగోడచా
టుననుండి విడుతును.

(ఇద్దఱు బురుజులపైనుండి నిష్క్రమింతురు.)

[నేపథ్యమున నొకవైపున—హాహాహా ! హాహాహా ! యను మహా ధ్వను లగును.]

ఉ—అదేమి ? అదేమి ? ఈపక్షమున నింత హాహాకారము వినఁబడు చున్నదేమి? భటులారా! ఏమి యాయెల్లరి, ఎందుల కాయాందోళనము !

[నేపథ్యమున] ఈపక్కనుండి యెవ్వరో మమ్ముఁ గొట్టుచున్నారు.

దా—కాశ్మీరదేశచమూభటులారా! ఆపక్కనుండి మిమ్ముఁ గొట్టువా రెవ్వరును లేరు. కోటపైనుండి పడుచున్న బాణములే మీకట్టిభ్రాంతిని గలిగించుచున్నవి

[నేపథ్యమున] పైబాణము లేవో పక్కబాణము లేవో మే మెఱుఁగమా? అదిగాక పక్కలలో బల్లెములుపుచ్చుకొని పొడుచుచున్నారు. కత్తులచేఁ దల లెగురఁగొట్టుచున్నారు.

ఉ—ఏమిది ? ఏమిది ? వింతగనున్నది. నేను వచ్చుచున్నాను. తొందరపడకుఁడు.

(ఉద్భటభట్టు నిష్క్రమించును.)

[నేపథ్యమున మఱియొకవైపున హాహాహాహం ! యను రవములు పెద్దగోల వినఁబడును.]

దా—ఆహాహా ! అదేమి ! ఈవైపునఁగూడ నెంతో హాహాకారము వినఁబడుచున్న దేల ? భటులారా ! ఎందుల కాగోల ?

[నేపథ్యమున] హాహా ! హాహా ! ఈటెలతో గుచ్చుచున్నారు. గండగొడ్డళ్ళతో నఱుకుచున్నారు. కట్టెలతోఁ గొట్టుచున్నారు. హా హా !

దా—అదేమి ? అదేమి ? ఆవైపున మీశత్రు వెవ్వరు లేరే ! ఆ వైపుననున్నవా రందఱు మీవారే. ఎందుల కాయాందోళనము? మీనీడఁ గాంచి మీరే బెదరెద రేల ?

[నేపథ్యమునఁ బెద్దగోల యగుచున్నది.]

దా—ఆహాహా! ఏమి యుపద్రవము! ఏమియుత్పాతము- ఏమి యీ మహాకలకలము! ఆహా! మనసేన యావ్రక్క నదిగో.

గీ. ఎగసి పరుగెత్తి వ్రాలుచు । నెగసిపడుచు
భోరునను దాఁకి వెనుకాడి । ముందు కేగి
యుద్ధతోద్రేకమున నూఁగు । చుండు నదిగొ
యంబుధితరంగసంచయ । మనుకరించి.

ఆహా! ఈపక్క నదిగో-

ఆ. వె. కట్టుకోఁతయందుఁ । గ్రకచంబులాగున
పోత్రిమట్లు ఖడ్గ । పుటమునందు
నాసుగోనికండ్ల । యట్లు వాహిని యూఁగు
లాఘుఁ గాలిబంతి । ననుకరించి.

మాత్రో నిట్లు యుద్ధముచేయువా రెవ్వరు? కోటమీఁదివా రెప్పటి లాగున బాణములను గురియుచునే యున్నారు కోటగోడలు దుమికి యెవ్వరు వెలుపలకు రాలేదు. వీ రెక్కడివారు? స్త్రీ రాజ్యమునకు మఱి యేరాజ్యమైన సాహాయ్యము చేయుచున్న దనుకొనుట కట్లు సాహసింపఁగల రాజ్య మేదియుఁ గానఁబడదు. ఈయుద్ధ మేమో మాయగా నున్నది. శత్రు వెవ్వరో తెలియదు. ఆవైపున బల్లెపుఁబోటులచే నీవైపున బాణఘాతములచే నడకొత్తులోనివక్క లాగున సేన నలిగి పిండియగుచున్నది. ఉద్భటభట్టా! అచ్చటి శత్రు వెవ్వరో తెలిసికొంటివా?

[నేపథ్యమున] అందఱు మనవారులాగుననే యున్నారు.

దా—అయ్యయ్యో! ఇది మఱింత మాయగా నున్నదే- మనవా రొకరి నొకరు చంపుకొనుచున్నారా?

[నేపథ్యమున] దామోదరశర్మా! శ్రీరాజ్యమువారు మనభటుల దుస్తులవంటి దుస్తులను ధరించి మనలోఁ గలసి మనవారిని జంపుచున్నట్లు తోఁచుచున్నది మనవాఁ డెవ్వఁడో గుర్తించుట బహుకష్టముగా నున్నది. భద్రముగాఁ బ్రవర్తింపవలయును. ఉద్భటభట్టునితో సేనాభటులను బాగుగాఁ బరీక్షింపవలయు నని చెప్పుము.

దా—ఆహా! మామహారాజుగారు బాగుగానే కనుఁగొనినారు. మహారాజా! భద్రముగనే ప్రవర్తించెదము.

[నేపథ్యమున] ఆవైపున కెవ్వఁడో పరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు. వెంబడించువారి కందకుండ నున్నాఁడు. నీవు వాని కెదుటఁబడి పట్టుకొనుము.

దా—రానీ-రానీ-భటులారా! మీరుకూడ సిద్ధముగా నుండుఁడు. గొడ్డళ్లు రవంతసేపు వదలిపెట్టుఁడు. ఆపరుగెత్తుకొనివచ్చువానిని బట్టవలయును.

[నేపథ్యమున] పట్టుకో- పట్టుకో- అదిగో అక్కడ- అదిగో అక్కడ- దొరకకుండ నున్నాఁడు. పోను పోను.

దా—భటులారా! ఆతనిని బట్టుకొనుమని మహారాజుగారి యాజ్ఞయైనది. పట్టుకొనుఁడు. చంపుట కుత్తరువు లేదు. జాగ్రత్త-మీరు మీమీయాయుధములను దూరముగ నుంపుఁడు. ఎట్లైన నాతనిఁ బట్టవలయును గాని చంపఁదగదు. అటువచ్చుచున్నాఁడు. అటువచ్చుచున్నాఁడు. జాగ్రత్త. జాగ్రత్త.

అంద—ఏఁడీ- ఏఁడీ- రానీ- రానీ—(తొందరతో నటునిటుఁ బరిక్రమింతురు.)

దా—భటులారా! కాళులకుఁ గఱ్ఱ లడ్డుపెట్టుఁడు బారలు చాఁచుకొని నిలుపఁబడుఁడు ఎగసి పైఁబడి పట్టుకొనుఁడు. చావుభయ

ముచేఁ బరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు ఆతనివిసరుచే వెను కకుఁ బడిపోవుదురేమో- దట్టముగ రెండుపంక్తులుగా గోడల వలె నిలువఁబడుఁడు.

[తొందరతోఁ బురుమవేషమున్న చపలయు నల్వురుభటులుఁ బ్రవేశింతురు ]

దా—పట్టుకో- పట్టుకో- (దామోదరశర్మభటులు స్త్రీరాజ్య భటులను బట్టుకొనఁబోయి వారిచేఁ బట్టువడుదురు. దామో దరశర్మ చపలను బట్టకొనఁబోవఁగఁ జపల యాతనికాళ్లపై గట్టిగఁ గొట్టును.)

దా—హాహా ! ఎంతదెబ్బకొట్టివితిరా ! హాహా ! (కన్నులు తిరుగగఁ గూరుచుండును.)

చ—(దామోదరశర్మ చేతిలోనిశంఖము తీసికొని పూరించి) వినయా దిత్యమహారాజా! పరుగెత్తిపోవుచున్న స్త్రీరాజ్యభటులను బట్టుకొంటిమి. తొందరయేమియు లేదు. మీరక్కడఁ బనిచూ చుకొనుఁడు. ఇక్కడ కెవ్వరును రానక్కఱలేదు. (అప) స్త్రీ రాజ్యభటులారా! పర్వతములవలె నిలువఁబడి యెవ్వరి నిటకు రానీయకుఁడు. జాగ్రత్త. భటులారా ! మీరుపట్టుకొన్న దా మోదరశర్మభటులను ప్రక్కనున్న మనభటుల కప్పఁజెప్పి వేగ రండు. (వారు దామోదరశర్మభటులను దీసికొనిపోయి వెంటనే వత్తురు.

[నేపథ్యమున] శంఖపూరణధ్వని యగును.

చ—(తనలో) వినయాదిత్యమహారాజు సరేయనునట్లు శంఖమున బూ రించి ప్రత్యుత్తర మిచ్చుచున్నాఁడు. (ప్రకా) తల తిరుగుట తగ్గినదా ? ఇఁకనైన లేవఁగలవా?

దా—(లేచి) ఓ వినయాది—

చ— నోరు తెఱచినయెడల నీశాకుత్తో నీనోటిలోఁ బొడుతును. జాగ్రత్త. ప్రాణముం దిచ్ఛకలవాఁడవైనయెడల నోరుమూసికొని నేను చెప్పినట్లు చేయుము.

దా—నీవుచెప్పినట్లు నే నేలచేయవలయును ? నీ వెవఁడవు?

చ—భటులారా ! ఈమంత్రిని బట్టుకొని బాధింపుఁడు

(మంత్రిని బంధింతురు)

దా—నా కీబ ధ మేల ? నీ వెవఁడవు ?

చ—ఎవఁడనా? ఎవఁడనా? స్త్రీపురుషభేద మెఱుఁగవా? శుంఠా ! నీవు మంత్రిపదవి నిట్లే నిర్వహించుచుంటివఁటరా ! భటులారా ! వానిని దన్నుఁడు. (వారు తన్నుదురు.)

దా—అబ్బ- అబ్బ ! ఉండుఁడు. నీవు కాంతవా ?

చ—కానా ? నా మొగమువంకఁ జూడుము. నా మొగములో మగతనపుమాలిన్యము మాంద్యము నగ్గెతనము నబ్బెఱికము నేమైన నున్న వేమో? చూడు: పండువెన్నెలగాచునట్లు ప్రకాశించుచున్నదో. నీవు కవివఁటే. ఏదీ నా మొగముపై నొక్కపద్యము చెప్పఁగలవా ?

దా—నీ మొగము- కవిత్వమునా ?

చ—నీకర్మ మింతవఱకు వచ్చుటచే నట్లంటివి. కత్తి యుపయోగపడనప్పు డింకఁ బనికివచ్చునది కలమే కాదా ? ఇప్పుడు కవిత్వప్రసంగ మేల యని యంటివా? పాపము- నిజమే- ఏడ్చుచున్నప్పుడు కవిత్వము చెప్పలేవుకాఁబోలు అటులైన నీవు కవినామమున కర్హుఁడవు కావు. ఏడ్పుసుతిలోఁ గలపి కవితాగానమొనర్చువాఁడే కవి—కన్నీటిమంచుతోఁ గవిత్వపుగులాబుల నెవఁ డలంకరించునో వాఁడే కవి—కడుపుమంటచే జనుల యజ్ఞానము నెవఁడు కాల్చునో వాఁడే కవి—కర్పూర

ముఃలె హరించిపోవుచు నెవఁడు తనదివ్యసౌరభమును బ్రిపంచమున విడుచునో వాఁడే కవి ఇతరులను సంతోషపెట్టువాఁడు సంతతచింతాక్రాంతుఁడు. సర్వప్రపంచానందఘనసంధాన సమర్థ మగుకవిత్వము కలవాఁడు ముష్టివాఁడు—కడుపునిండు కాంతాసంపర్కమున కక్కఱకువచ్చును ఇప్పుడీప్రసంగము నీవు వలదంటివి కావున మానెదను. నీవు దామోదరశర్మవని నే నెఱుఁగుదును. నే నెవతెనో నీ కిప్పటికైనఁ దెలిసెనా ?

దా—శ్రీరాజ్యములోనిదాన వని తెలిసినది నీ వక్కడ నెవతెవో నా కెట్లు తెలియును ?

చ—నేను నీవలె నట మంత్రిని గాను—పద్మావతిరాజ్ఞిగారి దాసిని—నాపేరు చపల—

దా—ఆఁ. ఆఁ దాసివే !

చ—ఆ. దాసినే-దాసినని చెప్పుటకు గర్వపడుచున్నాను. కాశ్మీరదేశ చక్రవర్తిమంత్రిమూఁతిపై సాగఁదీసి లెంపకాయకొట్టిన దాసిని—ఈగను బట్టినంతసులువుగ నాతనిఁ బట్టి బంధించిన దాసిని—అట్టిదాసిని—అవసరమునుబట్టియింతకంటె నెక్కువదాసిని—నావంటిదాసి నేయాస్థానమునైనఁ జూచితివా? రాష్ట్రమున కలంకారము నావంటి దాసియా? నీవంటి మంత్రియా? శ్రీరాజ్యములోనిదాసియే సార్వభౌమునిప్రధానుని కంటె ఘనురాలని లోకమున కిప్పుడు వెల్లడి యైనదా? మొదట నీరాజును బంధించితిమి. అప్పుడే మీకు బుద్ధి రాఁదగినది. ఇప్పుడు నీవు బద్ధుఁడవైతివి. మీ మొగము ! బుద్ధిలేక కాని మీ కాఁడువారితో యుద్ధ మేమి ?

దా—(తనలో) ఆహా! కాలవిపర్యయము- ఎంతకఠినములైన మాటలు వినుచున్నాను. ఆహా! ఎట్టినీచకాంతచే బద్ధుఁడనైతిని.

గీ. బంధములు తిట్లు దెబ్బలు । పరిజలకెల్ల
రకును గాలవశంబునఁ । బ్రాప్తమగును,
గాని కర్తనుబట్టి యా । కష్టసమితి
పరిబలమగు తారతమ్యంబు । పడయుచుండు
వీరుఁ జేసినసంకెల । భీరుఁ డొసఁగు
కట్టుతాఁడంతక్రూరమై । కానఁబడదు;
విభుచపేటాపుటరుణిమ । వేగ మాయు
భటుని చీకొట్టు మదినంత । వ్రణముచేయు
గొప్పవాఁ డేయుదెబ్బకుఁ । గొంచెబాధ,
కొంచెవాని ఘాతమునకు । గొప్పబాధ
పట్టెడగుపుట్టతేలిచ్చు । బాధ కొంచెది
చీమ్మొట తటితేలట్టి । చిచ్చువైచు
పురుషువేటుచే శ్రమ లేక । పొలియవచ్చుఁ
దాఁకుచు కాటునఁ గనుకుచుఁ । దరలినట్లు
ఇంతి వేసినవేటు సహింపఁ దరమె?
కట్ట! పొడపాము కఱచిన । కాటులాగు
అందుపై దాసి- హా దాసి- । యధమ దాసి
తిట్టె గాడపైఁ గొట్టె; బం । ధించె సకట!
మూషికము జీపురుకోడ । మోఁది యట్లు
దాసి మఱికికాల్వను బడ । వేసినట్లు.

చ—ఏమి యోజించుచున్నావు? అటు నిటు చూచుచున్నావేల? నీకు సాయపడువా రెవ్వరు నిట లేరు క్రిందటిసారి యేవో మాయమాటలు మారాణిగారిసన్నిధిని బల్కి నీరాజును విడిపించు

కొనిపోయినావు; ఇప్పు డెవఁడువచ్చి నిన్ను విడిపించుకొని పోఁగలఁడో చూతము. భటులారా! ఆపెద్దగోతిలో నీతనిఁ బడవైచి పూడ్చిపెట్టుఁడు.

భటు—నడు-నడు- గోతిలోనికి నడు. ఊఁ రావయ్యా—(లాగును)

దా—ఉండు. ఉండు. చపలా!

చ—ఉండెదను. నే నుండ కేమి? పోవలసినాఁడవు నీవు. నీకు నాచేత నిట్టిమరణముండఁగా నెవఁడు తప్పింపఁగలఁడు? ఇంతగొప్పగా బ్రదికి తుదకు దాసిచేతఁ జావవలసి వచ్చెను గదా యని యేడ్చుచున్నావు కాఁబోలు! నీవు బ్రాహ్మణుఁడవై పుట్టుట నీప్రయోజకత కాదు నేను దాసినై పుట్టుట నాయప్రయోజకత కాదు. మనజన్మములపై మనకు స్వాతంత్ర్యము లేదు. కాని మననడతలపై మన కున్నది. మనఘనతలు మనప్రవర్తనములఁ బట్టియుండును గాని మనజన్మములఁ బట్టియుండ వని విద్వాంసుఁడవైన నీవే యెఱుఁగనప్పుడు నీవు విద్వాంసుఁడ వెట్లగుదువు?

గీ. శాంతి నెఱుఁగని బ్రాహ్మణు । జన్మిదంబు
దాసిగాఁగ రాబొందుకుఁ । దీసిపోవు ;
వికలుఁడగు రాజతలమీఁది । మకుటమునకు
దాసిసవరపుముడికున్న । వాసి లేదు ,
కాతరుం డగు సేనాని । ఖడ్గమునకు
కులటచుట్టపీకెకుఁ గల । విలువ లేదు ,
అర్హతనుబట్టి వస్తుల । కధికఘనత
కాని వస్తుజన్మముఁబట్టి । కాదు నిజము.

దా—చపలా! ఈమాటలకేమి కాని, నాతో యుద్ధమొనర్చి నన్నుఁ జంపుట రణమర్యాద కాని యెట్లో దొరకితినిగదా యని చే

తులు కాళ్ళు కట్టిపెట్టి బ్రతికియుండఁగా గోతిలోఁ బడవైచి పూడ్చిపెట్టుట కేవలము తుచ్ఛమైనపని కాదా? నీవు ధైర్యసాహసములు కలదానవు కావునఁ జెప్పుచున్నాను. మీ వైరెనుగురున్నారు. నే నొక్కఁడను. నాకట్లు విప్పి నాయుద్ధనైపుణ్యము ను గాంచుము.

చ — నీప్రయోజకత్వము వేఱ చూచుటల? అది యీసౌభాగ్యముగ నున్నది కాదా? నన్నుఁ గొట్టఁదలఁచి నాచేఁ గొట్టఁబడితివి. నన్నుఁ బట్టఁ దలఁచి నాచేఁ బట్టువడితివి ఇఁక నీయుద్ధనైపుణ్యము చూచుట కేమున్నది? నోరుమూసికొని చచ్చుటకంటె నీవు గానఁబఱుపవలసిన నైపుణ్య మేమియు లేదు.

[నేపథ్యమున] చంపవలను చంపవలదు ఆతనిని బంధించి మహారాజుగారియొద్దకుఁ దీసికొనిపోవలయును.

దా — (తనలో) అది ఉద్భటభట్టనిమాట - ఎవరినో చంపవలదనుచున్నాఁడు.

చ — (తనలో) ఆహా! ప్రమాదము సంభవించినదేమో కదా! మాసీనానాయిక దగ్గ పట్టుబడినది కాఁబోలు! ఎందులకైన మంచిది, దామోదరశర్మ నిటనుండి పంపెదను ఇప్పు డీతని జంపుట తగదు. కుండమార్పుచే మాదుర్గమ్మను దీసికొనవలసివచ్చునేమో? మీ రాతనికన్నులకు గ్రంతలుకట్టి పాతాళగుహాద్వారమునఁ గోటలోనికిఁ దీసికొనిపోయి మందాకినమ్మ కర్పింపుఁడు. నో రెత్తినయెడలఁ జంపుదుమని బెదరింపుఁడు. అంతేకాని చంపకుఁడు. వెంటనే తీసికొనిపొండు. ఒకభటుఁడు మాత్ర మిచ్చట నుండినఁ జాలును. నీ వాచాటున నుండుము. నే నీల వైచినప్పు డివలకు రమ్ము.

భటు—రావయ్యా-రావయ్యా-(లాగుకొని దామోదరశర్మను భటులు తీసికొనిపోవుదురు.)

చప—అదిగో! ఉద్భటభట్టు దుర్గమ్మను దీసికొని వచ్చుచున్నాఁడు. నే ననుకొనినట్లే యయినది. ఏమగునో చూతము- నే నీచాటున నుండి వారిమాటలు వినెదను. (ప్రక్కకొత్తిగిల్లును.)

[ఉద్భటభట్టు దుర్గచేయిపట్టుకొని ప్రవేశించును]

ఉ.—భటులారా! మీ రెవ్వరు నాసాహాయ్యమునకై రావలదు. నే నిప్పుడే వచ్చెదను. మీరు జాగరూకతతోఁ బోరాడుచుండు, డు—దుర్గా! మగవాఁడవని యొక్కతెప్పపా టనుకొంటిని జమా! ఆఁడుదానవే యైతివి—ఇఁక గావలసిన దేమి?

గీ. ప్రధననిస్సాణములు శుభ। వాద్యములుగ
ఘోటకధ్వానములు గాన। ఘోషములుగ
నాశుగజ్వాలికలు దీపి। కావళులుఁగ
నబల! నీపాణిపీడన। మాచరింతు
పూలవ్రేటులచేఁ గంది। పోవు నీదు
తనువు వింటిపోటుల కేల। దార్తు వకట!
ఎండచే వాడు పొగడపూ। దండ నెవఁడు
జ్వాలనకీలావళిని జేర్ప। సాహసించు?
వీణతీఁగలఁ బలికించు। వ్రేళ్ళ కకట!
కర్కశజ్యావికర్షణ। కలన గలిగె;
ముదురు లేరంగులను బ్రాణ। ములను బోయు
కుచ్చుతోఁ గోడకును వెల్లఁ। గొట్టఁదగునె?
వీరరసకేలి సోలి తా। పించు నీకుఁ
జల్లనైన శృంగారర। సంబె తగును,

ముందు వేసవి యెండలో । మరగి మరగి
తూలుప్రాణికిఁ బయ్యెర। గాలివలెను.

చ—(తనలో) వహావ్వా! గ్రుద్దులాటదండడిలో ముద్దులాట సందడియా? మహాయోధుల బాకుపోటులలో మన్మథుని ప్రసవ బాణములా? ఓ మన్మథుఁడా! నీకు మతిపోయినదా యేమి? ఉద్యానవనములందు- నదీసైకతసీమలందుఁ గ్రీడాశాలలందుండువాఁడవు. చెఱకువిల్లుపుచ్చుకొని రణరంగమునకు సిద్ధపడితి వేమి? దేశకాలపాత్రజ్ఞానము మనుజులకు నశించినట్లే నీకుఁగూడ నశియించినదా యేమి? కాక, కాశ్మీరరాజ్యమునకు స్త్రీరాజ్యమునకు సంధి ఘటింపఁజేయుట కింతకంటె మంచిమార్గము లేదని. నీవు మధ్యస్థుఁడవై వచ్చితివా? ఉద్భటభట్టా! నీవు మా సేనానాయికను వలచితివా! మహాపురుషుఁడవు. వీరవిటాగ్రేసరుఁడవు—ఏమీ! ఆముద్దరా లింక మాటలాడకుండ నున్న దేల?

ఉద్భ—దుర్గా! మాటలాడ వేల?

దు—మగవారి మాటలు నమ్మఁదగినవి కావు.

చ—ఓస్! నీచమత్కారము సంతకుఁబోను—మగవారి మాటలు నమ్మఁదగినవి కావా? ఆఁడుదాని మాటలు నమ్మవచ్చును గాఁబోలు! ఈయుద్ధములోఁ బొడిచి గెలిచెద నని రాణితోఁ జెప్పి మగవస్త్రసింగారించి భుజమున విల్లుధరించి బయలు దేఱితివే! తుద కేమి చేసితివి! పరసేనాధిపతి ప్రక్క నొదిగి యొదిగి సిగ్గుచేఁ జివికి చివికి, యుబలాటముచే నుబికి యుబికి కదనపుమాటయే మఱచి గర్భాధానవార్తలు కులుకుచు వినుచుంటివా! ఏమాట కామాటయే చెప్పుకొనవలయును. స్త్రీ రాజ్యమునకుఁ బ్రబలవిరోధియైన కాశ్మీరరాజు కారాగృహ

ముందుండ నే నాతనిక్తై తహతహ పడలేదా? అతఁడు నన్ను పేక్షింపలేదు. అది నాకర్మము-మొత్తముమీఁద నాఁడుదాని వలనఁ గార్యమగునని నమ్మినపురుషుని కాశాభంగము తప్పదని మనచర్యవలన స్పష్టమగుచున్నది. రణరంగముకంటె శృంగా రరసవిచ్ఛేదకమైన దెచ్చటనైన నున్నదా! ఇందులోనే మన కీతగులాటము తటస్థించినదే- మనపరిస్థితులు మహానుకూలము గనే యున్నయెడల నెట్లు మిడిసిపోవుదుమో ?

ఈ—దుర్గా! ఏమంటివి? మగవారిమాటలు నమ్మఁగూడదనియా? ఎవఁడామగవాఁడు! ఆఁడుదానిచే జయింపఁబడినవాఁడు మగ వాఁడెట్లు ?

చ—(తనలో) ఛీ! నిర్భాగ్యుఁడా!

దు—అసత్యమాడుచున్నావు. నీవే నన్ను జయించి బంధించితివి కదా ?

ఈ—నావింటివేత్రలు నీవఱకు రాకమునుపే నీకంటివేత్రలు నన్ను నీకు వశుని జేసినప్పుడు జయము నీదా నాదా ? నిన్నుఁ బట్టుటకు నాచేయి చాఁపకుండనే నీవు నాచిత్త మాకర్షించి ముంగురు లచే బంధించినప్పుడు జయము నీదా నాదా ? దుర్గా! నీవు నన్ను గెల్చితివి. నీవే నన్ను బంధించితివి. కాని యీబంధము శాశ్వతముగా నుండున ట్లనుగ్రహింపుము.

దు—(తనలో) నిన్నుఁ జూచుటతోడనే నేను గాటముగా వలచితిని. (ప్రకా) మనము శాశ్వతమా యేమి? మనబంధములు శా శ్వతముగా నుండుటకు.

చప—ఓస్! నీబ్రహ్మజ్ఞానము బండలైపోను—ఇందులో నిదియొక సొగసా! సెబాస్!—రణరంగమునశృంగారమేవింతగా నుండఁ గా నీశృంగారములో రవంత వేదాంతపుమేళవింపా? బంధము

మట్టునకు సమ్మతమేనా ? శాశ్వతత్వము మట్టునకసత్యమా ? నీకుశలత్వముగోడ గడ్డలుగాను మునుపు నీకీమాత్రపు నేర్పయిన లేదే-ఇది రాగమువలనఁ గలిగిన మెఱుగేనా? రాగమే తనువునకు రంగు—కంటికిఁ గళ—మనసునకు వికాసము—వాక్కునకు నెఱజాణతనము—బ్రదుకునకుఁ బట్టు. రాగమువలననే వాఁడుది కవయిత్రియగును; గాయనీమణియగును. చిత్రలేఖనసమర్థ యగును. రాగవతి తనతీక్ష్ణమైనకంటితోఁ బైయూరనున్న భర్త పరకాంతతో నౌఁగిలించుచున్నాఁడో చూడఁగలదు. ఆతఁడు దానినే పలుకులచే లాలించుచున్నాఁడో వానిని వినఁగలదు. రాగమిచ్చినన్ని శక్తులు యోగమైన నీయఁజాలదు. దుర్గా! నీకీరాగవశత నీవిశేషమునకే వచ్చియుండును గాని నీవు చేయుపని యెంతమాత్రము బాగుగా నున్నది కాదు. మనపై దండెత్తివచ్చిన పరరాజుసేనానితో నీవు సేనానాయికవయ్యు నీలాగున నూకలోఁ బెట్టిన సపోటాపండువలె మెత్తబడుట మంచిది కాదు. అది నీప్రతిష్ఠకుఁ దగదు. రాణిగారి ప్రతిష్ఠకుఁ దగదు. నిన్ను నమ్మినరాణి నపకీర్తిభాజనగాఁ జేయుట నీవృత్తికి, నీజాతికి, నీస్థితికిఁ దగదు. నీవు నావంటిదాసివే యైన యెడల నీవెట్లు గడ్డిగఱచినను నిన్నను వాఁ డుండఁడు. నిన్నిప్పుడు నేనే యనవలసి వచ్చినది. నీకేమిపోఁగాలము! నీకుఁ బెద్దభవనము లేదా ? విశేషధనము లేదా? నీయిష్టము వచ్చినవానిని వరించి పెండ్లి యథావిధిగఁ జేసికొనవచ్చునే—వాఁకిటిలో నెవఁడో యిగిలించి దరిఁజేరగ వానిని బ్రక్కగదిలోని కాకర్షించు పణ్యకాంతవలెనే చేసితివే—స్త్రీరాజ్యసేనానాయికవు. నీవే యిట్లు చేయుట తగు

నా? ఇంక నేమున్నది? స్త్రీరాజ్యయుద్ధతంత్రి మనఁగఁ బున
స్సంధానమంత్రి మనిపించితివే—చీ!

ఊ—ప్రాణప్రియా!

సీ. చిన్నారిజాబిల్లి । జున్నుమీఁగడపాలు
తొగలపుప్పొడులతోఁ । దోడుపెట్టి
కండుకోయిలవాలుఁ । గంటికెంపులతాళిఁ
గొదమరాచిల్కము । క్కనుజేర్చి
సాలిపట్టునఁ బూల । జాళువాలంగారుఁ
బొడపాముకూసంబు । బొందుగట్టి
చిగురాకుగిన్నెలోఁ । జెంగల్వతెఙ్గుచేఁ
బొగడేటిముద్దులఁ । బొగపుబెట్టి
గీ. చెట్టువంగఁబూయు । శేఫాలికలనుంచుఁ
దోఁచుచుక్కతోడఁ । దుడిచివైచి
మెఱపుతీఁగగుచ్చి । విరిదండగాఁ జేసి
యిచ్చి సౌరభమున । నెగసిపోదు.

చ—(తనలో) అయ్యో అర్థములేని కొత్తకవిత్వము కట్టుచున్నాఁడు. పిచ్చినెత్తియున్నది. ఇఁక నోరుమూసికో! నీకవిత్వము చూచి రాజు నీకు సేనాధిపత్య మిచ్చినందల కాతనికిఁ దగిన ప్రాయశ్చిత్తము చేసినావు. కవి తిన్ననిదారిలోఁ బోయినంతసేపే కాని వంకరదారిలోఁ బడినాఁడనఁగ నందులో మరల మార్గునవధియుండునా? వేశ్యాపీఠిఁబడిన కవిశిఖామణి చక్రవర్తికంటె స్వతంత్రుఁడు. భిక్షుకునికంటె దీనుఁడు. పైవిటులను గఱచుటలో వెఱ్ఱికుక్కకంటె నున్మత్తుఁడుని వేశ్యచేఁ దిట్లుతినుటలో వేదాంతికంటెను శాంతిమంతుఁడు. వేశ్యలకుఁ గీర్తనలను గృతినిచ్చి వారివెనుకఁ దాళపుటంగునకు సిద్ధపడును. అటువం

డి గాలిపాటున నాతఁడు దేవాలయవీథిని బడినయెడల శ్రీకృష్ణ నామామృతపానమున మైమఱచి తాండవించును. తాను రాధయై శ్రీకృష్ణునితో బాలక్రీడలాడును మఱియొకగాలిపాటున నాతఁడు రణరంగమునఁబడినయెడల ఖడ్గచాలనముచేఁ గదనగీతికాగానముచే గాంధర్వాస్త్రసంభవసమ్మోహనమును గల్పించి శత్రువులఁ జిత్తరువులఁ జేయును ఏపనిలోఁగూడ నాతని కభ్యాస మావశ్యకము కాదు. అరివశ్యమున కబలావశ్యమున కాతనికొక్కటే మంత్రము. కలముపట్టినను గత్తిబట్టినను నాతని కొకటేచాకచక్యము ఓ-చక్రబంధములలోఁ బద్మవ్యూహములు పద్మవ్యూహములలోఁ బరిరంభవిలాసములు, పరిరంభవిలాసములలో హఠయోగసాధనములు—అతనిమనస్సునకన్నిశక్తులున్నవి-కాని బుద్ధిమాత్రము లేదు బుద్ధిలేనివారిలలో నుద్భటభట్టగ్రగణ్యుఁడు. లేకున్నయెడల నింతబుద్ధిమతియైన భార్య దొరకునా?

ఉ—దుర్గా! మాటలాడ వేల?

దు—ఇఁక మాటల కేమున్నది—

ఉ—సెబాస్- లేదుకదా? ఇఁకఁ జేష్టలవలననే సంతోషముకావా ? ఇఁక దరిజేర్చుకొందును. (మీఁద జెయివైచును)

చ—ఓరి గాడిదా! నామొకలుకూడ గగుర్పొడుచునట్లు చేసితివేమిరా? నోరుమాలినదుర్గ కావున సరిపోయినది కాని నా మీఁదనే నీవు చేయివైచి యుండినయెడలఁ నోటకందకములోఁ బడునట్లు నిన్నుఁ దన్నియుందును. రాగమనునది కంటికలకలాంగున నంటురోగము కాఁబోలు! నా కొడలు జలదరించుచున్నది. లోన గుబులుకలుగుచున్నది. ఇప్పుడు కాశ్మీరదేశాధీశునిపై మనస్సు దుముకుచున్నది. ప్రయత్నమున నడఁచుకొనవలయును

దుర్గానురాగముకూడ నాయనురాగమువలె నవ్యాజమైనది-గభీరమైనదేమో- ఎట్లు తెలియఁగలము? కాని రాణిని విడుచుటకు దుర్గకాని రాజును విడుచుట కుద్భటభట్టుగాని విచారింప రెందుచేత? ఆచింతయే పిడికి లేనట్లున్నదే!

ఉ—మా రాజును విడుచుట కవంతచింతాకరమైనను వదలి యెట్లైనఁ బోవుటకు నిశ్చయించుకొంటిని. నీవు నీరాణిని విడుచుటకు సిద్ధపడియుంటివా?

దు—పలికిమాలిన స్త్రీరాజ్యము—నా కామాట నింకఁ జెప్పకుము. ఈ త్రప్రపంచమున మనకిద్దఱకుఁ దావే లేకపోవునా?

చప—ఆహా! దుర్గా! తుదకు మగముండకొడుకే కవంత నీతిగలవాఁ డనిపించుకొని నాఁడా! తల్లియని తండ్రియని సోదరియని రాగవంతుఁడైన మగవాఁ డెప్పుడైన కవంత స్మరించుకొనునుగాని యాఁడు దానిరాగావేశము పిశాచమువలె భయంకరమైనది త్రాఁచు పామువలె బహుక్రూరమైనది. ప్రళయమువలె సర్వనాశకమైనది. ఆఁడుదానితత్త్వ మాఁడుది యెఱుఁగును గాని మగవాఁ డెట్లెఱుఁగును? కొమ్మయని ముద్దులగుమ్మయని పైరంగులకు లోంగిపోయి వనితల వర్ణించు కవులు వట్టివెఱ్ఱులు.

ఉ—దుర్గా! మన మిక్కడ నుండక యెట్లైనఁ బోవుదము.

చ—(తనలో) పోవుట—నరేకానీ—ఉద్భటభట్టా! నిన్ను సాగదీసి యొక్కతన్నుఁదన్ని మాదుర్గను నే నింటికిఁ దీసికొనిపోఁగలను- కాని మీసౌఖ్యమును బ్రతిబంధించు పాపము నకొల్లను. పూర్వమున నేభార్యాభర్తల నెడఁ బాపుటచేతనో నా కీబ్రహ్మచారిణిబ్రదుకు వచ్చినది.

దు—ఎక్కడకో పోనేల? మాభవనముననే రహస్యముగఁ బోయి యచ్చటఁ గొన్నినాళ్ళవఱకు దాఁగియుందము. మనల నెవ్వరు దెలిసికొనలేరు. రమ్ము.

(ఉద్భటభట్టు దుర్గ నిష్క్రమింతురు.)

చ—ఆహా! దుర్గా! భర్తవెంటఁ బోయితివా? నీ కిట నేమిపనియున్నది?

గీ. అరుణుఁ డుదయాద్రిపైఁ జేరు । నంతలోనె
యంధకారంబుతో రాత్రి । యరుగునట్లు,
విపులదారిద్ర్యగతి సంభ । వించునపుడు
గౌరవముతోడ లజ్జ క్రి । క్కదలినట్లు,
గాఢరాగోదయంబగు । క్షణమునందు
వెలఁది విభుతోడఁ బోవుట । వింత యేమి?
రంగసీమను నాటకా । రంభమందు
మొదటి తెర కట్టుతో లేచి । పోవుఁగాదె?

(ఈలవైచును)

[భటుఁడు ప్రవేశించును]

చ—భటుఁడా!

భటు—ఏమి సెలవు?

చ—యుద్ధ మెట్లున్నదో కనిపట్టితివా?

భటు—కడుపుగిట్టున నిండినతరువాతఁ గదలలేనివానివలె నున్నది.

చ—ఎందు చేత?

[నేపథ్యమున] దామోదరశర్మా! ఉద్భటభట్టా! రణము నుపసంహరింపు మని యాజ్ఞాపించితిని. మీ రెచ్చట నున్నారో యిటు రండు.

చ—ఆహాహా! అది మహారాజుకంఠరవము. దామోదరశర్మశంఖ
మును బూరించి రాజు నిటకాకర్షింతును. (శంఖమూఁదును)

[నేపథ్యమున] దామోదరశర్మా! నేనే యిటకు వచ్చుచున్నాను.

చ—భటుఁడా! నీవు యథాస్థానమునకుఁ బొమ్ము. తిరుగ నీలవైచి
నప్పుడు వెంటనే రమ్ము.

(భటుఁడు నిష్క్రమించును.)

పహ్వా! కాశ్మీరదేశాధీశుఁ డిక్కడకే వచ్చును. ఆయనదర్శనము
నా కిఁకఁ గలుగదేమో యని పరితపించితిని. తుదకు నాదర్శ
నమునకే యాతఁడు వచ్చుచున్నాఁడు. హృదయమా! అంత
యలజడి నొందెదవేల? ని న్నాతఁడు వరింపఁడని యెఱిఁగియే
యుంటివి కదా! నిన్నుఁ దిరస్కరించినను నీ కాతనియందే యింత
మమకారమా? హృదయమా! యథార్థమైన యనురాగ
ముచేఁ బ్రకాశించుచున్నావు. ఇచ్చిపుచ్చుకొనుటలో విశే
ష మేమున్నది. అది వంటపూఁటివ్యాపారముకంటె భిన్నమా?
తిరిగిపుచ్చుకొనునపేక్ష లేకుండఁ గృతజ్ఞతయైన వాంఛింపు
కుండ నిచ్చినవాఁడే యథార్థప్రేమపరిపూర్ణుఁడు. నీవట్టిదానవు
గ నున్నావు కావున నాతనిస్మరణముచే నావేగ మందుము. ఆ
తనిమాటలు వినుటచే నుప్పొంగిపొమ్ము ఆతనిదర్శనముచే
నెగిరి యెగిరి పడుము. ఆతనిస్పృశించుట కబికియుబికి సాఁగి
సాఁగి పగిలిపొమ్ము. ప్రతిఫలమున్నప్రేమ వ్యక్తితో నశించు
ను గాని ప్రతిఫలములేనిప్రేమమున్నదే అతి యాచంద్రా
ర్కము నిలుచునది.

[వినయాదిత్యుఁడు ప్రవేశించును.]

మహారాజా! నమస్కారము,

విన — వెలుతురనుండి వచ్చుటచే నిన్ను గుర్తింపలేకున్నాను. నీ విక్కడ నుండనేల ?

చ — (స్వగ) రాణిసేవ చేయుచున్న నే నీయవకాశము వ్యర్థపోనీయఁ గూడదు. అయ్యో! ఒక్క భటునే యుండుమని చెప్పితిని. మఱి యిద్దఱున్న యెడల బాగుగానుండియుండును. ఈతఁడు మహా బలాఢ్యుఁడు, మేమిద్దఱము పట్ట గలమా ? నా కీతనియందను రాగమున్న నేమి పోషించుచున్న రాణికి ద్రోహఁ మొనర్ప దగునా ? ఉన్నవలపేదో ప్రాణముతోఁగాని పోవునది కాదు. లేని సుఖమేదో చచ్చినదాక వచ్చునది కాదు. ఈమాత్రమునకు రాణిగారియెడల నవిశ్వాసముగాఁ బ్రవర్తించితినన్న పాడు మాట నా కెందులకు? [ఈలవైచును భటుఁడు ప్రవేశించును ]

విన — అదేమి ? అదేమి ?

చ — భటుఁడా! నేను నీకు సాయ మొనర్తును. నీవాతని బట్టుకొనుము.

(భటుఁ డాతనిఁ బట్టుకొనఁబోవఁగ రా జొక్క లెంపకాయ నాతని గొట్టును. భటుఁడు పాఱిపోవును.)

చ — రాజా ! నాచేతికి నీ వందక యే పోయితివా? నిన్నీలాగైన స్పృశించుభాగ్యము నాకు లభింపదయ్యెనా? నిన్ను స్పృశించియుండినయెడల నీ వాతనిని గొట్టినట్లు నన్నుఁగూడ నొక్కటి దౌడ పైఁ గొట్టియుందువే ! నేనుగూడ నిన్నుఁబట్టఁ బ్రియత్నించినప్పుడు నీవాతనిఁ గొట్టి నన్ను మానివైచితి వేల? నీ కీపాక్షికము తగునా ? మహారాజవే. ధర్మవిరుద్ధముగఁ బ్రవర్తింతువా ? ఇదిగో దౌడ — మొగమునీడఁ గనఁబఱుపఁగలదౌడ- మగవానిస్పర్శము స్వప్నమందైన నెఱుఁగనిదౌడ — మకరికాపత్రలేఖనకర్షణమైన నెఱుఁగనిదౌడ — అరవిచ్చిన గులాబి

పూవుగలదౌడ—ఇదిగో—యీదౌడపై- పరమభాగ్యరేఖా సమన్వితమైన నీయఱచేయి నైదువ్రేళ్ళు మన్మథుని పంచబాణమువలె బగ్గుమని యంటుకొనునట్లు వేయరాదా? మహారాజా! దౌడ నిచ్చి సిద్ధముగానున్నాను వేయరాదా? నీశంఖచక్రచిహ్నములచే నాతనువు పవిత్రమగునే! నీదోహదమున నామనస్సు పుష్పించి ఫలించునే. ప్రాణప్రియస్పర్శమహానందముచేఁ బ్రాణము చల్లబడునే. మహారాజా! ఎందులకు సందేహించుచున్నావు? అర్థుల కోర్కెలు తీర్చుటకింత మీనమేషములు లెక్కపెట్టుచుంటివి నీ వెక్కడిమహారాజవయ్యా! నీధనము నిమ్మంటినా! నీరాష్ట్రము నిమ్మంటినా! నీవలపు నపేక్షించితినా! ఈయలేనివాఁడవు కొట్టనైనలేవా? తీఱనివలపుచే నాప్రాణము నీకు బలినిమ్మని భగవంతుఁడు నానుదుట మూఁడుబంతుల లిఖించియుండ నిన్ననవలసినపని యేమున్నది? మహారాజా! నాకింక సెలవు.

(పోఁబోవును.)

విన—చపలా! చపలా! ఆఁగు.

చప—చపల యనుపేరు నీనోట నుచ్చరించితివా? చపల యనునదొకతె యున్నదని నీకు జ్ఞప్తియున్నదా? చాలును, నా జన్మమున కంతయేచాలును. మహారాజా! నీయెదుట నాకుద్రేకము హెచ్చుగానుండును. నే నిఁక నుండఁజాలను. (పోఁబోవును)

విన—చపలా! వెళ్ళకుము. రవంత శాంతిపడుము.

చ—శాంతిపడనా? నన్ను శాంతిపడుమని చెప్పుచుంటివా? పదునెనిమిదేండ్లదాననే- స్వైరవిహారముగల వంశములోనిదాననే అనురాగాంబునిధినే- అందులో మొదటివలపే- నాప్రియుఁడ

నన్ను నిరాకరించెనే-నామనస్సీవిధముగా మండిపోయినను నేనే మి తొందరపడు చేసితినని నన్ను శాంతిపడుమంటివి? ఈర్ష్యా సంకలితమైన మఱియొకతెయే యైనయెడలఁ—దుచ్ఛదేహ సౌఖ్యమే ప్రధానముగాఁగల మఱియొకతెయే యైనయెడల—నీ పై నీసరికిఁ బగఁదీర్చికొనియుండదా? చక్రవర్తిపైఁ బగఁదీర్చు కొనఁగలవాఁ డెవ్వఁడుండునని గర్వింపకుము. చక్రవర్తి కుప కార మొనర్చుటకుఁ జాలము కాని యాతనిపైఁ బగఁదీర్చుకొను టకుఁ జాలమా? బొమ్మిడాయిలపులుసులోఁ బెట్టిన దమ్మిడి వత్సనాభి యార్గురు మహారాజులకు సరిపోవునే- అంతవఱ కేందులకు? వీథిలోఁ బోవుచుండఁగా నొక్క బెడ్డవేత్రిటు చాలునే- నే నట్లు చేయుట కేమైనఁ బ్రయత్నించితినా? నీవు నాకు బారెఁడెడములో నున్నావు. ఒక్క బాకుపోటుతో నిన్నంత మొందింపలేనా? నేను యుద్ధతంత్రమున గడిదేఱిన జాణను గాని పిఱికిదాననుగానే. నన్నుఁ గొట్టుమని నన్ను హింసింపుమని నిన్నుఁ బ్రార్థించుచున్నదానను. నేను నీకేమి యుపకృతి చేయఁగలను? నన్ను నమ్మిన మారాణిగారియెడల నేను యుద్ధమున విశ్వాసహీనముగఁ బ్రవర్తింపలేదు. శక్తివంచన లేకుండ నెందఱనో చంపితిని. తుదకు నిన్నుఁ గూడ బంధించుటకుఁ బ్రయత్నించితిని. అదేమికర్మమో కాని నాకుఁ జేయి సాఁగనైనలేదు. నేను రాణియెడలఁ గాని భగవంతునెడలఁ గాని యిప్పటికి ద్రోహముతోఁ బ్రవర్తింపలేదు. ఇఁకముందుఁగూడ నటులే. నీతో నాకు మాట లెందులకు? ఉద్రేకముతో నేమాటయనఁబోయి యేమాటయందునో! ఆ యుపచారము నా కెందులకు? నే నిఁకఁ బోదును. (పోఁబోవును)

విన—ఉండు చపలా! ఊరక తొందరపడెద వేల? నేను మాటలా

డుట కవకాశ మీయకుండ నీ వొక్కటుచదువు చదువుచు
న్నావు నీవు యుద్ధములోఁ దిరిగితి నని చెప్పితివి కాదా! మా
దామోదరశర్మను నుద్భటభట్టును నీ వెక్కడనైనఁ జూచితివా?

చప—చూచితిని.

విన—వా రిప్పు డెక్కడనున్నారు?

చప—వారికొఱకు నీవు దేవులాడుచు బయలుదేఱితివా? ఎట్టిమంత్రి
నెట్టిసేనానాయకుని జాగ్రత్తపెట్టితివయ్యా! మంత్రులు సేనా
నాయకులు యుద్ధరంగమం దప్రమత్తులైయుండి రాజక్షేమ
ము నరయవలసియుండఁగా నీవు వారిని దడుముకొనుటకై
బయలుదేఱితివా? వారిలోకమువలననే వా రిట్టి నిరుపయో
గులైరా? నీచేతఁగాసితనముచే నైరా? అదికాక—

విన—చపలా! విశేషించి మాటలాడకుము. నీవు వారిని నిందింప
వలదు వారు సమరతంత్రకోవిదులు. అనేకరణములం దలవా
టుపడిన నేను, వారిసాహాయ్య మపేక్షింపను. నాచేతనైనట్లు
నన్ను నేను గాచుకొనఁగలను. వారిద్దఱను సమరము సంకుల
ముగానున్నచోటికిఁ బంపితిని వారు కనఁబడకుండ నున్నారు.
వారిజాడ నీవలనఁ దెలిసికో నభిలపింతును.

చప—వారిద్దఱిలో నెవ్వరిమాట ముందుచెప్పవలయునో చెప్పుము.

విన—ఎవ్వరైననేమి? ముందు దామోదరశర్మమాటయే చెప్పుము.

చప—దామోదరశర్మను నేను బంధించి మాకోటలోనికిఁ బంపితిని.

విన—ఆహాహా! చపలా! నీ వాతని బంధింపఁగలిగితివా? ఎంత
ధైర్యసాహసములు కలదానవు! నీపరాక్రమమునకు శిరఃకం
పన మొనర్పవలసినదే. వీరలోకము మెచ్చఁదగిన పని చేసితివి.
ఎన్నెన్నిమహాయుద్ధములలో నెంతపౌరుషశాలియై ప్రవర్తించిన
వీరాగ్రణి— అట్టి దామోదరశర్మను—

చప—ఆయుద్ధములలో నాఁడువా రుండిరా? వారు లేకపోవుట వలననే మీ కిన్నిజయపత్రికలు. మగవారు మగవారిని జయించుట పౌరుషము కాదు. ఆఁడుదానిని జయించినవాఁడే మగవాఁడయ్యా!

విన—చపలా! ఏందువలన?

చప—ఆఁడుది శక్తిస్వరూపిణి. పురుషయోధునకు స్త్రీయోధ రణమందుఁ దారసింపఁగనే విల్లు వంపకుండనే, యొరనుండి కత్తి తీయకుండనే ముందడుగునకుఁ బ్రయత్నింపకుండనే పురుషుని శక్తిలో సగము, స్త్రీ యాకర్షించుకొనును. అటుపిమ్మట శక్తి యుడిగినమగవీరుఁ డెట్లుండునో చెప్పవలయునా? లంఘనములు చేసి పథ్యము పుచ్చుకొన్న రోగివలెఁ బరధ్యానముగ, వెఱ్ఱిమొగముగ, మందమతిగఁ దలగోకికొనుచుఁ గుసికిపాట్లు పడుచుండును. అంత స్త్రీయోధ యొక్క లెంపకాయఁ గొట్టి యాతని బాధించును.

విన—వీరవనితల నెదుర్కొనినపురుషయోధు లంద ఱట్లగుదు రని నీయభిప్రాయమా?

చ—అస్వాభావపుటసాధారణపుటనకతవక తత్త్వముగల నీవంటివారెవరో తప్ప—

విన—చపలా! అట్టివానిని గూర్చి యింతనిర్లక్ష్యముగఁ బలుకుట తప్పు కాదా?

చప—నేను మొదటనే చెప్పితిని. స్వభావోద్రేకముచే నేమైన మోటుమాటలు వచ్చునేమో నేను బోయెద నంటిని గాదా? అది గాక మీయెడల నాకు భయ ముండవలసినయావశ్యకత యేమున్నది? మీపెట్టుపోఁతలలో నాకేమిలోపము కలుగునో యని భయమా? మీరిచ్చు నేడువారపునగలలో నేమైనఁ

గొడవ కలుగునోయని భయమా? మీవలన నాకుఁ గలుగఁ
బోవు పిల్లలు కలుగరేమో యని భయమా? ఏలోపము నా
కుఁ గలుగునని భయపడవలసినది? రోదసీకుహరమంత పెద్ద
లోప ముండనేయున్నది అది నాకర్మము.

విన—నీమాటలసందడిని నాసేనాధిపతియగు నుద్భటభట్టుసంగతి నడుగుటయే మఱచిపోయినాను.

చప—నీ వాతనియెడల నంతదయతోఁ బ్రవర్తించునప్పు డాతఁడు నీయెడల విశ్వాసహీనముగఁ బ్రవర్తించిన తప్పేమున్నది?

విన—ఆతఁడు నాయెడల నవిశ్వాసి యయ్యెనా? చెప్పు- చెప్పు. ఆతఁ డేమిచేసినాఁడు; ఎక్కడనున్నాఁడు?

చప—ఆతఁడు మాసేనానాయిక యగు దుర్గచే బద్ధుఁడైనాఁడు.

విన—ఆఁ, ఆఁ, ఆతఁడు కూడ బద్ధుఁడయ్యెనా? బద్ధుఁడై మీదుర్గ ముందున్నాఁడా?

చప—దుర్గాబాహుబంధమం దున్నాఁడు.

విన—ఆ, ఆఁ, ఆతఁడు దాని వరించెనా? ఎంతపనిచేసినాఁడు!

చప—నీచేతఁ గానిపని నాతఁడు చేసినందుల కాతనిఁ గొనియాడఁ దగదా?

విన—(విసుకుతో) సరే- సంతోషమే కాని యాతఁ డెక్కడున్నాఁడు?

చప—దానిని దీసికొని లేచిపోయినాఁడు.

విన—ఆహాహా! పోషకు నెడల నెంతవిశ్వాసఘాతుకుఁడై ప్రవర్తించెను?

చప—ఆతఁడు విశ్వాసఘాతుకుఁడా? ఎవరికి? నీకా? విశ్వాసఘాతుకుఁ డెట్లు? ఆతని నీవు బానిసగాఁ గొంటివా? నీయొద్ద నాతఁ డుద్యోగి కాఁడా! ఆతనికి సమ్మతియగునంతకాల మాతఁడు నీయొద్ద నుండును. ఆతనిచేఁ బనిగొనకుండ నూరక కూడుచుం

డఁబెట్టి యాతని బోషించుచుంటివా? నీ విచ్చుచున్న వేతనమున కాతఁడు నీకొలువు చేయుచున్నాఁడు. నీ వాతనివేతనమును దీసివైచినయెడల నీ వెంతవిశ్వాసఘాతుకుఁడవో యాతని యిష్టము ననుసరించి యాతఁడు నిన్ను వదలిపోయినయెడల నాతఁ డంత విశ్వాసఘాతుకుఁడు. వెలబెట్టి కొన్నకొలువులో విశ్వాసఘాతుకత యేమున్నది? పోషణము పోషణమని పెద్ద పెద్దమాటలఁ జెప్పెదవేల? ఇష్టమైనకాంత నాతఁడనుగ్రహించకపోవుటచే స్త్రీయంత్రి మేర్పఱచి మగవానికి మేలు చేకూర్చిన సర్వలోకపోషకుఁడైన భగవంతునెడల నాతఁడు పరిపూర్ణవిశ్వాసయుక్తుఁడై ప్రవర్తించెననియే నానమ్మకము.

విన — చపలా! ఇక నాతనిఁగూర్చి చెప్పకుము ఆహాహా! ఎంతపని జరిగినది? ఇద్దఱుఁగూడ లేకపోవుటచే సైన్య మెంతకలఁగుఁడు పడినదో!

చప — సైన్యముసంగతిఁగూడ నన్నుఁ జెప్పుమంటివా?

విన — వినుటకు సిద్ధముగానున్నాను.

చప — నీసైన్యమునుగూర్చియు, నీమంత్రి సేనాపతులఁగూర్చియు నీవు నన్నడిగినదనుకఁ బలుకఁదగనంత దుస్థితికి నీవు వచ్చితివను మాట స్పష్టమైనదా? ఇందువలన నీకింక విజయాపేక్ష నిర్మూలమైనదని నిశ్చయమైనదా? స్త్రీరాజ్యముపై దండెత్తుట వట్టి తెలివితక్కువయని తేటపడినదా?

విన — ఈగొడవ యంతయు నీకెందులకు? నాసైన్యపుసంగతి యేదో చెప్పెదనంటివి కాదా?

చప — అందులకే యిది యుపోద్ఘాతము. గురువుగారు కల్లుద్రాఁగినప్పుడు శిష్యులు చుట్టమైనఁ గాల్పకుందురా? సేనానాయకుఁ డొకదాని నెత్తుకొని రణరంగమునుండి లేచిపోయినప్పుడు

సేనాభటులు పరకాంతలతోఁ బరిహాసమైనఁ జేయకుందురా? మీపురుషభటులు మా స్త్రీభటులఁ గాంచి క్రమ్ముకొనుట కవకాశము లేని స్త్రీలక్షణములు వారియందుఁ గనిపట్టి వారు స్త్రీలని నిశ్చయపఱచుకొనిరి.

విన—ఆ- ఆ- తరువాత ?

చప—తరువాత నిఁ కేమున్నది? ధైర్యముతోఁ బాటు ధనుర్బాణములు జాఱిపోయినవి. ఒడళ్ళతోఁ బాటు మనస్సులు గగుర్పొడిచినవి. నిశ్వాసములతోఁ బాటాశలు దీర్ఘములైనవి. అంతట స్త్రీభటుల నెత్తిగుడ్డలులాగువారు కొందఱు, మెడలోని హారములలోని ముత్యములు మంచివో కావో యని పరీక్షించువారు కొందఱు, నొడలకు రాచినది కుంకుమపూవో రక్తచందనమో యని మూర్కొనువారు కొందఱు, బట్టలకు దుమ్మంటె నని రవంతయెత్తి దులుపువారు కొందఱు నై- ఒక యాదరణమా- ఒక యాగడమా- ఒక్క కన్నుగీటా- ఒక చేతిపోఁగా? ఒక ప్రార్థనమా- ఒకబలాత్కారమా ?

విన—అబ్బ ! ఉండు ఉండు. స్త్రీభటు లెందఱున్నారేమి?

చప—ఎందఱోనా ? మహారాజా! ఇరువదినాల్గువందలే కాదా ? అంతవఱకుఁగూడ నెందులకు ? ఒకపెద్దసేనలో నొకపడుచుపిల్ల యుండునెడల సేన కంతకు నొకసారియే మతిపోవలసినప్పుడు నీసేన బ్రదు కింక నడుగఁదరమా? స్త్రీలయెదుట నీసైన్యమందలి వీరాగ్రేసరు లందఱుఁ దెలికపిండిపైచిన కుక్కలవలె—

విన—సరే- చాలులే- చాలు- ఒక్కటేధోరణియా ?

చప—మహారాజా ! నాసంతోషముకొఱకు నేను జెప్పుచున్నాను ఈగ్రామమునకు నీమూలమునఁగదా యింత యసాధారణ సౌభాగ్యసంపత్తి సంభవించినది! మగవారికొఱకు మొగము

వాచియున్న మెల్లకంటి రుప్పతల దొడ్డికాళ్ళపెద్దమ్మల కంద అకు రవంత సంసారసుఖజ్ఞానము కలిగినది? ఇదివఱకుఁ బ్రపంచమున నెన్నియుద్ధము లైనవి! దేనియందైన నింతమహోచిత్రవైభవ ముండెనని వినియుంటిమా? లోకములో విటు లెందఱు లేరు? విటకత్తె లెందఱు లేరు? పదిపట్టణములకు సరిపోయినంత లోకగ్రామములో నొకమైదానమునఁ జేరి సరిగా నొక్కముహూర్తమున శృంగారకథాక్రియాకలాపమును బ్రదర్శించుట ప్రపంచనాటకమున నేరంగమందైన నుండెనా? అప్సరసల నృత్తగానాదులతో దేవతలు పుష్పవృష్టి గురియఁదగినంత భూలోకకల్యాణ మిదివఱ కెచ్చటనైన జరిగినదా? ఈపుణ్య మంతయు మీది.

విన—(తనలో) ఆహా! ఎంతయపకీర్తి వాటిల్లెను?

గీ. భటులయోగ్యతచేఁ గీర్తి । ప్రభుని దగును
భటులదుష్టత నపకీర్తి । ప్రభునిదగును
తనయు లుత్తము లైనచోఁ । దండ్రికీర్తి
యధము లైనప్పు డాతని । కపకీర్తి;

సద్భటునిచేత నపకీర్తి । సంభవించు
దుర్భటునిచేత సత్కీర్తి । దొడరుచుండు
నొక్కయొకవేళ; యనుట కే । మున్న దింక
వానిఁ దిట్టనె? నుతియింప । నౌనె వీని?

యశము వచ్చిన నుప్పొంగి । యపయశంబు
వచ్చినప్పుడు దైన్యంబు । వడయఁ దగునె?
యన్ని యనుభవింపఁగవలె । నలుకుగనక
యోర్పువంటిది నరుని కిం । కొకటి లేదు.

చ—మహారాజా! ఏమి యాలోచించుచున్నావు? నీమంత్రి దామోదరశర్మగతి యేమగునో యని చింతించుచున్నావా?

వి—నేను బద్ధుఁడనై నప్పుడు దామోదరశర్మ మీరాణిగారి దగ్గర మొనర్చి నన్ను విడిపించినాఁడు. నే నాతనియుపకృతి మఱతునా? నాచేతనైన ట్లాతని విడిపింతును మీ రాతని నెచ్చట దాచిన సరే. నే నిట్లంటినని మీరాణిగారితోఁ జెప్పుము.

చ—ఆశేఁడు తనబంధవిముక్తి కంగీకరింపకపోవునెడల నేమిచేసెదవయ్యా?

వి—ఆఁ, అంగీకరింపకపోవుట కూడనా?

చ—తిరుగ మొదటికి వచ్చితివా! మహారాజా! నీకు శృంగారరసములో నెక్కడను వెలివిశేషములు లేకపోయెనేమయ్యా? కొందఱుమగవారి కింకులో స్వయంజాతమైన యాభ్యంతకల్పనాశక్తి యుండును. కొందఱు కల్పనాశక్తిహీనులయ్యును సాధనబలమునఁ గల్పనాశక్తి కలవారివలెనే కొట్టుకొనిపోవుదురు. కొందఱు రసాంతదూరము బలాత్కారమున నీడ్చుకొనిపోయినతరువాత రాజమార్గమునఁబడి తప్పటడుగులు వైచుచునైన ముందునకుఁ బోవుదురు. నీ వెందునకుఁ బనికిరానివాఁడవై పోయితివే! లాగినను లేదు. ఈడ్చినను లేవు. గెంటినను లేదు. నాప్రాణములు తీయుటకుఁ గాని భూలోకమున నీ వెందులకయ్యా? దిగ్విజయము చేయుచున్నానని ప్రతిష్ఠ చెప్పుకొందువు కాఁబోలు! ఎందులకువచ్చినదిగ్విజయము! వింటిబద్ద బుజమునఁ దగిలించికొని వీరాధివీరుఁడ నని బయలుదేఱితివా? ఆఁడుది ముట్టుకొనునరికి ముద్దో యున్నవాఁడవు నీవే వీరుఁడవా? నీవంటివారేకదా నిక్షేపములాగున గువ్వపిట్టలవలె గులుకుచున్నారు! ఒకరినిజూచి నేర్చుకొనవమ్మెను, ఒకఁ

చెప్పిన నేర్పుకొనవయ్యెను; నీకుఁ దోఁచనేతోఁచదయ్యెను; తలలో మన్నయ్యెను; మనసులో మంచుగడ్డయయ్యెను; చేతిలో విల్లయ్యెను—ఎందులకువచ్చిన వేసమయ్యా!

విన—చపలా! నీమాటలవలన నాకు నవ్వువచ్చుచున్నది.

చ—నామాటలు నీకు బాగుగా నచ్చుటచేత నవ్వువచ్చుచున్నది నీవు మహావిద్వాంసుఁడవఁటే- ప్రపంచచరిత్రములో నొక్కపంక్తి యైనఁ జదివినవానికిఁ బ్రపంచమంతయు శృంగారరసమయమని తెలియకుండునా? అట్టిశృంగారరసము నిన్ను స్పృశింపకుండుట వింతగ నున్నదే!

గీ. ఉషను వెన్నాడురవిఁ గని । యులికిపడవె?
మొయిలునను మించుఁ గని గగు । ర్పొడువలేదె?
హిమకరుఁడు పట్టలేక రో । హిణి కొసంగు
వెచ్చనగు ముద్దులను విని । వికృతిఁ గనవె?

సీ. పద్మినీముఖబు ముద్దాడి । భ్రమరుఁ డట్టె
సారఘము గ్రోల నీకు నో । రూరలేదె?
లీలఁ బైకప్పు సడలించి । గాలి కుసుమ
గుచ్ఛముల నంటఁ బుట్టదే । గుబులు మదికి?
కులికి ముద్దులఁ జిలుకుగు । వ్వలను గాంచి
ప్రణయగీతంబు హృద్వీణ । పాడలేదె?
మెడను మెడఁ జుట్టి పరవశ । పడినకోక
ములను గనఁ బ్రాణ మెచటికో । పోవలేదె?
పర్వతంబైన రాతిరి । ప్రక్కఁ గొఱఁగి
యోషధిని ముద్దుగొని హాయి । నొందునంద్రు
ప్రకృతి నెటఁ జూడ శృంగార । రసమె సర్వ
సృష్టికిఁ బ్రధానసూత్రమై । చెలఁగుఁగాదె?

అట్టిశృంగ రరసమున । కలరి పొంగి
యుడికి మతిచెడి కడఁదొ్రిక్కి । వడఁకి కరఁగి
తన్మయుండయి రసలీనతను స్వరూప
నాశ మొనయఁ గూలఁడు । నరుఁడు కాఁడు.

విన—అయినదా నీయుపన్యాసము? కాకున్న యెడల నంతటితోఁ గట్టి పెట్టుము. ప్రపంచము శృంగారదృష్టిఁ జూడఁగ శృంగారమయముగ నుండును. వైరాగ్యదృష్టిని జూడ వైరాగ్యమయముగ నుండును. ప్రపంచము సుఖమయ మనుకొన్నవానికి సుఖస్వరూపమున నుండును దుఃఖమయ మనుకొన్నవానికి దుఃఖమయమై యుండును. నీబుద్ధి ననుసరించి ప్రపంచమున నిన్ను నీవే చూచుకొని ప్రపంచము నీవంటి దనుకొనుచున్నావు. ప్రపంచము నా కక్కఱ లేదనుకొన్నవాని కది దూరముగ నుండును. కావలయునన్నవాని నెత్తిమీఁది కెక్కును. అంటిముట్టనట్లున్నవాని కది యట్లే యుండును అదినిన్నుఁ బట్టియుండును గాని, దానినిబట్టి నీ వుండవు ప్రపంచమున్నదనుకొన్నవాని కున్నది. లేదనుకొన్నవానికి లేదు. నీమనసునుబట్టియే దానిరూపము. కవి కది గీతము. గాయకుని కది రాగము. సాలి కది మగ్గము. ముచ్చి కది పటము.

చ—మట్టితల కది మట్టిముద్ద—అంతేనా? నీపాండిత్యము గట్టి దని నే నెఱుఁగుదునయ్యా! ఖండనశక్తిలో గొప్పవాఁడవే - కాని ప్రపంచమునఁ గావలసినది సంధానశక్తి కాని ఖండనశక్తి కాదు. హృదయములో రస మున్నవానికిఁ గాని యదుకుటలోఁ జాకచక్యము కలుగదు. అది నీకు సున్న యని మనవి చేసితిని.

—చపలా! పనికిమాలిన గొడవతోఁ గాలమును వృథచేయు

చున్నావు. నాకు ముం దిది చెప్పుము. నామంత్రి బంధవిము
క్తి నంగీకరింపఁ డంటివి. ఎందుచేత?

[illegible]—అందుమీఁదనే యింత ప్రపంచపరీక్ష బయలుదేఱినది. ఇంత రాద్ధాంతపూర్వపక్షము లైనతరువాతఁగూడ నీకుఁ దెలియక పోవుట వింత! స్పష్టముగాఁ జెప్పనా? మామంత్రి యగు దామోదరశర్మను మామందాకినమ్మ మంత్రితో జోడుకట్టించుట కటకుఁ బంపితిని. ప్రభువుగారి కిప్పుడు విశదమైనదా? ఆప్రయత్న మక్కడ నిదివఱకు జరుగుచునేయుండును. ఎవరిమట్టునకు వారు వారికిఁ దగిన ఘటమును జాగ్రత్తపెట్టుకొన్నారు. నీవు నేను మాత్రమే మిగిలితిమి. నీవు నన్ను ఊఁ- అదిగో యొంతలో మొగము చిట్లించితివయ్యా! నామాట విని నన్నుఁ గట్టుకొని దూరదృష్టి లేక నీవు రచియించిన యీవింతనాటకమ్మునకు భరతవాక్యము చెప్పి కాశ్మీరమునకు—

విన—నరకహేతువులైన యీమాటలింకఁ గట్టిపెట్ట వేల?

చ—నరకము నాకా నీకా? నాకు లేదు. ఇంక నీమాట: నన్నాదరించినయెడల నీకు నరకమువచ్చు నని సందేహించుచున్నావు కాఁబోలు! ఆదరింపకున్నయెడల నీకు స్వర్గము వచ్చు ననుధైర్య మున్నదా? రాచఱికముచేసిన యయ్యవారికి నరక మెవరికిఁ దప్పినదో చెప్పుము. ధర్మరాజునకుఁ దప్పినదా? నీకు మాత్రము తప్పునని యె ట్లనుకొనుచున్నావు? ఏలాగునైన నీకు నరకము తప్పనప్పుడు నన్నుఁ గట్టుకొనఁగూడదా? ఈమడికట్టుకొను బాధకూడ నెందులకు? తిన్నను దినకున్నను గూడఁ బఱిణామశూలబాధ తప్పనప్పుడు కోడిపలావు తినక నోరుకట్టుకొనుట యెందులకు?

విన—ఆయంశమునుగూర్చి మాటలాడవల దని చెప్పితిని గాన దయ యుంచి మానుము.

చ—నేను నీతో మాటలాడఁదగిన దాయంశమే కాక మఱి యే మున్నది? నీవు వలదనుటచే నోటి నాఁపఁగలను గాని మనస్సు నాఁపఁగలనా? దేవునియందు లగ్నమైన భక్తుని చిత్తమువలె నీయందు నామనస్సు లగ్నమైనది. నే నల్పురాల నని నీ విత్త గా సందేహించుచున్నావు. దేవునిముందు భక్తుఁ డల్పుఁడు కాఁడా? భక్తునకు దేవుఁడు ప్రసన్నుఁ డగుట లేదా? నీవు రాజవగుటచే నాకంటె హెచ్చువాఁడ ననుకొనుచున్నావు కాఁబోలు! హెచ్చుతగ్గులభేదమును దెలిసికొనుట యట్లు కాదు. దేవునిముందు నీకు నాకు నేమైన భేద మున్నదేమో చూచుకొనవలయును. అది యున్న దని నీవు చెప్పఁగలవా? ప్రధానమైన దొకమాట చెప్పెదను. ఇదివఱకుఁ జెప్పియేయుంటిని. తీఱని యీావలపు నామృతికే వచ్చియుండును. మన సుడఁబట్టలేక యేదో యీామాట నీమాట యనుటకాని యంతకంటె వే ఱేమున్నది? నే నేమిచేయఁగలను? నీవంటివానితో నన్నుదారసింపఁజేసిన భగవంతు ననవలయును. నాకు సెలవు.

(నిష్క్రమించును.)

విన—నేను నిరాకరించితి నని యెంతయో యిబ్బందిపడుచున్నది. బుద్ధదేవా! కాసంతజ్ఞానము దానికిఁ బ్రసాదించి రక్షింపరాదా? సాయంకాల మైనది. త్వరగ శిబిరమునకుఁ బోయి భటుల నందఱిఁ జూచుకొని రేపటియుద్ధ మెట్లునడుపవలయునో యోజించుకొనవలయును. (నిష్క్రమించును.)

ఇది పంచమాంకము.

———

*

# శ్రీ
# చూడామణి.

## షష్ఠాంకము.

ప్రదేశము:— కోటవెలుపలి మైదానము.

[ప్రవేశము:— రాముఁడు, లక్ష్మణుఁడు.]

ల—రామన్నా! అట్టి చదువుచదువక యెవరు గెల్చిరో స్పష్టముగ రెండుముక్కలలోఁ జెప్పు.

రా—నే నెప్పుడు చెప్పినను సూటిగ రెండుముక్కలలోఁ జెప్పువాఁడనే కాని సోది పెట్టువాఁడను గాను.

ల—ఏదో కానీ—

రా—వీరిని వారు కొట్టినారు, వారిని వీరు కొట్టినారు. వీరిని వారు చంపినారు, వారిని వీరు చంపినారు. వారు వీరిని గన్నుగీటినారు, వీరు వారిని గాఁగిలించినారు. వారు వీరిని లేవఁదీసికొని పోయినారు, వీరు వారిని లేవఁదీసికొని పోయినారు. వారు వీరిని గెల్చితిమన్నారు, వీరు వారిని గెల్చితిమన్నారు. ఆమాటయే నిజమని కొంద అన్నారు, ఈమాటయే నిజమని మఱికొంద అన్నారు.

ల—అది యిదివఱకు విననదే కదా! ఆరాజుగారి యభిప్రాయ మెట్లున్నదో, యీరాణిగారి యభిప్రాయ మెట్లున్నదో, నీ వెవరివల ననైన వింటివా ?

రా—వినకేమి ? మాభటు లందఱు మంచివారే యని రాజుగా రన్నారు. మాభటు లందఱు మంచివారని రాణిగా రన్నారు. ఆఁడువాండ్రచేత మాభటులు చెడిపోయినారని రాజుగారన్నారు. మగవాండ్ర పోట్లబలముచే మాభటులు చెడిపోయి నారని రాణిగా రన్నారు ఆఁడువాండ్రు తొందరచేసి నంత మాత్రమున నేమి రవంత బుద్ధి నిలుపుకొనఁ గూడదా యని రాజుగారు తమ భటులను విసుగుకొన్నారు మగవాండ్రింత మీఁదికివచ్చిన నేమి కానంత తప్పుకొనలేకపోయి నారా యని రాణిగారు తమభటులను విసుగుకొన్నారు ఆఁడువారున్న చోట నింక యుద్ధము చేయఁగూడ దని రాజుగా రన్నారు మగపురుగుమీఁద విల్లెత్తఁగూడ దని రాణిగా రన్నారు. మహావీరుఁడైన నాసీవానిని దీసికొని దుర్గమ్మ లేచిపోయినదని రాజుగారు విచారించినారు దుర్గమ్మ నుద్భట భట్టు ముండకొడుకు లేవఁదీసికొనిపోయినాఁ డని రాణిగారు విచారించినారు

ల—ఒక్కటే సోదెయా ? నీగొంతుకఁ గోయ ! తరువాత నేమి జరిగినది ?

రా—టక్కుటిక్కు చెప్పుచుండఁగానే తొందరపడెద వేల ? త్రాసుచిప్పలలాగునఁ గావడికుండలలాగున యుద్ధ ముండుటచే మరల యుదయమున యుద్ధ మొనర్తు నని రాజుగారు రాణిగారికి వార్త నంపినారు. ఎంతకాలము యుద్ధము చేసినను నీలాగుననే యుండును గాని తేల దని రాణిగారు రాజుగారికి వార్తనంపినారు. అందుమీఁద నేమైన సరే కాని యుద్ధము నేను మాననని రాజుగా రన్నారు. అటులైన నేనంతకంటె మాననని రా

ణిగా రన్నారు. మీాయుద్ధ మేలాగని రాజుగారు రాణిగారికి వార్త నంపినారు మీాయుద్ధ మేలాగని రాణిగా రన్నారు.

ల—నీపిండకూడు. తర్వాగ నేడువరాదా ? తుద కేమి తేలినది ?

రా—ఆమాట నడిగినయెడలఁ జెప్పకుందునా ? నాభటులను నేను నమ్మనక్కఱలేదు. నీ భటులను నీవు నమ్మనక్కఱలేదు. నీవు నేను మాత్రమే పోరాడుదము. అందులో నెవరు గెల్తురో వారిది జయ మని రాణిగారు రాజుగారికి వార్త నంపెనారు.

ల—అదిగో-అది పద్ధతి-ఆలాగునఁ దెమల్చి చెప్పుము. అందుపై రాజుగా రేమన్నారు?

రా—నాభటులను నేను నమ్మనక్కఱలేదు. నీభటులను నీవు —

ల—ఏ ! వెనుక నిది చెప్పితివికాదా? రాజుగా రాద్వంద్వయుద్ధమున కంగీకరించినారా ?

రా—ఆమాటయే చెప్పుచున్నాను. నేను నీతోడను నీవు నాతోడను బోరాడవచ్చు నని వార్త నంపిరి. ఆయుద్ధము కోటలో జరుగవలె నని రాణిగారు తిరిగి వార్త నంపినారు. కోటలోనికి నేను రానని రాజుగా రన్నారు. నేను మీాశిబిరమునొద్దకే వచ్చెదనని రాణిగా రన్నారు

ల—ఆయుద్ధ మెప్పుడు ?

రా—ఇప్పుడే !

ల—మనముకూడ నక్కడకుఁ బోయి చూతమా ?

[నేపథ్యమున] సెబాస్ ! వీరనారీమణీ ! సవ్యసాచివలె గుడియెడమల భేదములేకుండ బాణమోక్షణ మొనర్చుచున్నావు.

రా—యుద్ధ మారంభమై కొంతసే పైనట్లున్నది. త్వరగఁ బోవుదము రా.

ల—సరే- నడు. (ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

ప్రదేశము:—రణరంగము.

[ప్రవేశము:—వినయాదిత్యుఁడు ధనుర్బాణములతో.]

విన—సెబాస్ ! వీరనారీమణీ ! సవ్యసాచివలెఁ గుఱియెడముల భేదము లేకుండ బాణములను గురియఁజేయుచున్నావు ! ఈసారి కాచికో—

గీ. సవ్యదర్వీకరాభ బాణత్రయంబు
వింట సంధించి కర్ణాంత మంట లాగి
పావకాభీలకీల లంబరము గ్రమ్మ
వేసెదను గాచికో..............

హా హా ! ఏమిది ? నేను కొట్టుటకు నారి లాగుచుండ గా నీవు ఁజేతి నే కొట్టినదే! హా హా ! దీని నీవల కూడఁ బెఱుకు గోపలఁ దిరుగ నామైవైచినబాణము కంఠమునకుఁ దగులునేమో ? వీర కాంతాశిఖామణీ! చేతిని గ్రుచ్చుకొనినబాణ మూడఁదీసికొనుదాఁక నొక్కత్రుటికాల మాఁగవా ?

[పద్మావతి ప్రవేశము.]

ప—నీ వశక్తుఁడవైనప్పుడొకత్రుటికాలమే యేమి ? ఒక్కజాము మాఁగుమనినఁ గూడ నాఁగుదును.

విన—రాజ్ఞీమణీ ! నీ వెంతదానవు ! ఇంతవిద్య పుట్టి నేర్చుకొంటివో ! పుట్టకయే నేర్చుకొంటివో ! నీవయస్సున కాశ్చర్యముగా నున్నది. ఎందఱురాజులతోడనో పోరితిని. ఇంతతక్కువవ్యవధిలో నిన్ని దెబ్బ లెవ్వరును గొట్టియుండలేదు. ప్రప్రధానమైన దక్షిణకరతలముననే కొట్టితివే ! కంఠమునుగొట్టినయెడల నీకు దిగ్విజయపత్రిక నిచ్చి యీనరికి వీరస్వర్గమున నుందునే! ఈచేయి యక్కఱకువచ్చునట్లు లేదు. బాణ మూడిరాకుండ నున్నదే !

క—నన్ను స్తుతింపవలదు. నేను నీకు రమునే కొట్టనెంచితిని. అప్పటికి నీచేయి నాగుతి కడ్డువచ్చుటచేత బాణము నీచేతికిఁ దగిలినది. దీనిని సులువుగ నే నూడఁదీసెదను. నీయెడమచేతితోఁ గుడియఁఅచేతిని గదలకుండఁ బట్టుకొనుము. నేను నీచేతి నంటఁదగదు.

విన—అటులే గట్టిగఁ బట్టుకొంటిని

క—కన్నులు మూసికొనుము (నిమ్మళముగనూండ దీసి) రాజా! బాణ మూడివచ్చినది చపలా! నీరమును గాయపునూనెసీసాను దెమ్ము.

[చపల ప్రవేశించును]

చ—చపలా! మహారాజునకుఁ జేయి గడగి యానూనె రాచియాతని చేరుమాలును జేతిఁ గట్టుము.

విన—వలదు వలదు. నేనే కడగి కట్టుకొందును.

చ—(అప) మహారాజా! ఇప్పుడైన నిన్ను స్పృశింపనీయవా? ఆహా! ఎంతకఠినాత్ముఁడవయ్యా! నేను ముట్టుకొనినంతమాత్రమున నీ కేమి మునిగిపోయినదయ్యా! నీకు రాఁదలఁచిన పరమపద మెక్కడ భగ్నమగునయ్యా! "నీ కీయుద్ధము వలదు ఇంటికిఁ బోవయ్యా! నీ కిచ్చటఁ బ్రాణాపాయమువటును వచ్చునయ్యా" యని నేను చిలుకకుఁ జెప్పినట్లు చెప్పితినే. ఏసుఖముగూడ నాకు లేనేలేదు సరేకదా! నాప్రాణప్రియుఁడు నాగురుఁడు నా దైవము నెచ్చట నైన సుఖముగా నున్నాఁ డన్నస తోషమైన నాకు లేకుండఁ జేయ సంకల్పించుకొంటివా? ఇప్పటికైనఁ దొందర లేదు. కాశ్మీరమునకుఁ బోవయ్యా—నీకాళులకు మ్రొక్కెదను.

విన—(అప) చపలా! నీయంతఃకరణ మాకాశమువలె నమేయముగ నున్నది. నీప్రేమరసము సముద్రమువలె నగాధ మని నే నెఱుఁగుదును. కాని నేను నీతిబద్ధుఁడను. నాపైఁబఱపిన యను రాగ మాబుద్ధదేవునం దుపయోగపఱచు నెడల నీవు కృతా ర్థురాల వగుదువు. నామాట వినుము. వెఱ్ఱిపడకుము. మను జునకుఁ గావలసినది నిర్వాణము కాని యిహసుఖము కాదు.

ప—రాజా! కట్టు కట్టుకొంటివా?

వి—పూర్తిగావచ్చినది. రాజ్ఞీమణీ! నీదయవలన బాధ రవంతతగ్గినది. ఇంతదెబ్బకొట్టినదిన్నుఁ గఠినాత్మురాలా యని పిలువనా? బా ణ మూడఁదీసి బాధ తగ్గించినందులకుఁ గరుణాత్మురాల యని పిలువనా? బాణ మింతసూటిగ జేసినందులకు నీధనుర్విద్యా మహిమను గొని యాడనా? వ్రణచికిత్స చేసినందులకు నీవై ద్యవిధానమును స్తుతింతునా?

ప—చపలా! నీ విట నెందులకు? పొమ్ము ఏమిపనివచ్చునో సమీ పమునసే యుండుము. (చపల నిష్క్రమించును)

మహారాజా! నన్ను స్తుతింపవల దని యిదివఱకుఁ జెప్పియుంటిని గాదా ?

విన—అట్లు లనఁదగదు.

గీ. ఇంద్రచాపముఁ గని కేకి । నృత్యమాడు
నది ముఖస్తుతికై యాడె । ననుట తగునె?
అరుణరుచిఁ గాంచి పాడెడు । భరతపక్షి
తరణినుతి యన నేమియో । యెఱుఁగు నొక్కొ?
మనసు నానందరసమున । మునుఁగఁజేయు
వస్తు వెదియైనఁ గని మది । పట్టలేక
బాగు బా గంట మనుజస్వ । భావ మంతె

కాని స్తుతియించు దోషము । దాన లేదు.
సరసకవితాసుమంబుల । పరిమళములు
గానజలధిసుధాతరం । గములరుచులు
బొమ్మలో వంకగీతల । పొంకములును
మంచినడవడిలోఁ గల్గు । మధురమహిమ
లెంత మోదంబు సరసుల । కీయఁగలవొ ?
వీరుఁ జేసినబాణంపు । విసరునాగసు
లంతయానందదము గాట । నాత్మ మెచ్చి
యంటినే కాని స్తుతియింప । నబల ! నిన్ను.

రాజ్ఞీమణీ ! నాచేయి బాగుపఱచి నన్నుఁ దిరిగి యుద్ధమున కర్హుఁడగు నట్లు చేసితివి. శత్రువునెడల నీవు చూపిన యుదారమనస్కతకు నేను మహానంద మొందితిని.

వ—ఆఁగవలసినయెడల నిఁక రవంతసే పాఁగెదను. చేయి యింకను బాగుగాఁ గుదురకపోవుటచే నీ వోడిపోయితి వను సందేహము నామనస్సునకుఁ దగులనీకుండమాత్రము చేయుము.

విన—(వికటముగ నవ్వి) నేనే యోడిపోవుదు నని నీ కింతనిశ్చయజ్ఞాన ముండవచ్చునా ?

వ—ఈమాత్రపుమాటయే నీకుఁ దప్పుగాఁ దోఁచె నేమి ? నీవు నీరాయబారిచే మొదట నేమని వార్త నంపితివో యప్పుడే మఱచితివా ? నీవు మఱచిన నేను మఱవఁగల ననుకొంటివా? అది యీపత్రికను బల్లెపుఁబోటువలె నెప్పటికప్పుడే కలుకు మనుచున్నదే ! "దిగ్విజయయాత్రకు నేను బయలుదేఱి య నేక రాజ్యముల జయించితిని. ఏచిన్నదైనను మీ దొరరా జ్యము కావున దానిఁగూడ జయింప నెంచితిని. మీరు మా యొద్దకు రానక్కఱలేదు. మే మోడిపోయితి మని మీ రొప్పు

కొన్నయెడల నేను మఱియొక రాజ్యముపైకిఁ బోయెదను." ఇవేకావా నీమాటలు! మీరు మాతోఁ బోరాడకుండనే మేమోడిపోయితి మనవలయునా? మేము పరాజయమునుందుట సిద్ధాంతమా? మీరు గెల్చుట శిలాశాసనమా? ఈమాట మీరు కఠోక్తిగాఁ బలికినఁ దప్పు లేదు కాని, నేను సూచనగాఁ బలికినఁ దప్పా? మేము శక్తిహీనలము మీరు శక్తిమంతులా? మేము విద్యావిహీనలము-మీరు విద్యావంతులా? మేము పరాక్రమరహితలము మీరు పరాక్రమసహితులా? మేమాత్మగౌరవము లేనివారము మీరు కలవారా? మేము మీకు బానిసలమా? మీరు మాకు స్వతంత్రప్రభువులా? మేము మీయిష్టమువచ్చినట్లుపయోగించుకొను నాటవస్తువులమే యనుకొంటివా? కాంతనుగూర్చి యింత తుచ్ఛమైన యభిప్రాయము నీకుఁ దగునా? నీవు కాంతకుఁ బుట్టినవాఁడవు కావా? నీభార్య కాంత కాదా? స్త్రీలోకమునే పరాభవించినప్పుడు నిన్ను నీవే పరాభవించుకొంటి వను జ్ఞానమైన లేదా? స్త్రీజాతిని బరాభవించిన నిన్నుఁ జిత్రవధ మొనర్పఁ దగదా? కాని మాచేతిలోని కవలీలగ దొరకిన నిన్నుఁ జంపుటయే నాయుద్దేశ మగునెడల నీ వింతవఱకు నిల్చియుందువా? నిన్ను విడిచిపెట్టినప్పుడైన స్త్రీహృదయ మెంత యుదారమైనదో గ్రహించుకొనలేకపోయితివా? నీతో బహిరంగముగఁ బోరాడుటకై నిన్ను విడిచిపెట్టితిని. నేను గెల్తు ననునాస నాకు లేదు. ఆఁడు దింతశక్తి కలదనిలోకమునకుఁ బ్రకటించుటకు నీతోఁ బోరాడుచున్నాను. ఈయుద్ధము నీకు నాకుఁగాదు, మగజాతికి స్త్రీజాతి కని నమ్ముము. ఆఁడుదానివర్యాద యాఁడుదానసైన నేను నిలువఁబెట్టుట విధి కావున నేన

నా జాతిపక్షమున నిలువఁబడితిని. నీకు నాకు ద్వేషము లేదు. ఇప్పుడైన నీతో నీమాట లేల చెప్పవలసివచ్చినదో యెఱుఁగుదువా ?

విన—కాంతామణీ! పురుషరాజ్యములవారికిఁగూడ మీకుఁ బాపినట్లే రాయబారిచే వార్త నంపితిని. మీ రాఁడువారగుటచే మిమ్ముఁ బరాభవించుటకుఁ బాపియుండలేదు. అది మీ రింత తప్పుగాఁ బట్టుకొని యింత యిబ్బందిపడుదురని నే ననుకొనలేదు. స్త్రీలఁ బరాభవించు నభిప్రాయము లేశమును నాకు లేదు. న న్నన్యథా భావించినందులకు విచారించుచున్నాను. "ఈమాటలు నీతో నిప్పు డేలచెప్పవలయునో యెఱుగుదువా" యని యడిగితివే? ఏల చెప్పవలయును ?

ప—ఈసారి పోరాటమున నేను నీబాణఘాతమునఁ బ్రాణములు విడుతునేమో యని యిప్పుడే చెప్పవలసివచ్చినది. మఱి యింకొక్కమాట!

ఆ. బానిసీలవలెను । బచ్చడంబులలాగు
తోలుతిత్తులట్లు । తోయజాక్షు
లెచటఁ జూడఁబడుదు । రచట దారిద్ర్యంబు
బహులహేయగతులఁ । బ్రబలియుండు.

ఆ. జ్వరము బొబ్బలమ్మ । కలరా స్ఫోటకమును
మారి చురుకులమ్మ । మరిడిదేవి
యెల్లకాల మచట । నిల్లుగా నివసించి
ప్రజలరక్త మొడిచి । త్రాగుచుండు.

ఆ మత్సరములచేత । మతకలహములచే
నంటరానితనపు । సొంటుచేత

సవతిజాతిత్వ । మాత యథాయథ
లగుటఁ బరులఁ గొల్తు । రశనమునకు.

ఆ. అధమగతిక మైన । యార్యనారీజాతి
యింకఁ గొంతకాల । మేగుపిదపఁ
దనమగతికి వగచి । తనయంతఁ దా సభి
వృద్ధి నొందు దైవ।కృపను బొంది.

ఆ. శాంతబుద్ధిచేత । శ్రద్ధాదికముచేతఁ
జగములెల్ల నేర్చి । సుదతు లెంతొ
దీనబంధు లగుచు । దేశభక్తాగ్రిణు
లగుచుఁ బ్రబలకీర్తి । నందఁగలరు.

ఆ. కావ్యశీరములను । గదనరంగములందు
శాసనము లొనర్చు । సభలయందు
మంత్రశాలలందు । మాధ్యస్థ్యములయందుఁ
గాంత నిల్చి భువికిఁ । గాంతి నొసఁగు.

ఆ. స్త్రీలభావిగతి గు।రించి స్త్రీ నగునేను
తీవ్రవేదనాప్ర।దీప్తివలన
నుడివినట్టి యిట్టి । పొడిపొడిమాటలు
జరుగు నయ్యా! బుద్ధి । నెఱుఁగు మయ్యా!

రాజేంద్ర! మఱియొకయావృతిలో నేను మరణించుటయే సిద్ధించు నెడల నాయీ నీరసపుమాటలను గవివైన నీవు రసపుష్టిఁ గలిగించి భరతదేశమున కంతకుఁ బ్రకటింతువు కాదా?

విన—తప్పకుండఁ బ్రకటింతును.

వ—ఆఁడువారియందసత్యమాడవచ్చు ననుమతములోనివాఁడ వేమో— ప్రమాణ మొనర్పుము.

వి—బుద్ధాచార్యుని పాదములతోడు.

ప — మేము బౌద్ధులము కానప్పటికి, నీప్రమాణము నాకు సమ్మతమే. రాజా! చూడుము. దురవస్థపాలైన స్త్రీజాతి మర్యాదను గాపాడ నెంచి రణరంగమున నిలువఁబడి పద్మావతి యను నొక యాఁడుది చేత బాణముతోఁ గంట నీటితోఁ గడుపు మంటతో నిట్లు పలికినదని నీవు గెల్చినదేశములందు శిలాశాసనములు చేయింతువా? నామాటల కింత ప్రఖ్యాతి నాగౌరవముకొఱకు కాక నారీమణుల హెచ్చరికకై కోరుచున్నానని నీవు తెలిసి కొంటివా? లేక దుర్భ్రమపడుచుంటివా?

విన — ఆఁ- ఎంతమాట — కాని నాబ్రదుకు స్థిరమైనప్పుగదా!

ప — అయినప్పుడే — రాజేంద్ర — నీ వానమప్రదేశమునకునడువుము. నేనుగూడ నిప్పుడే వచ్చెదను. నాబ్రదుకో నీబ్రదుకో యిప్పుడే తేలనై యున్నది.

విన — (తనలో) ఈకాంతను జూచి నమస్కరింప బుద్ధిపుట్టుచున్నదిగదా! ఈమెతో నెట్లు యుద్ధ మొనర్చెదనో ? (ప్రకా) రాజ్ఞీమణీ! సెలవు. (నిష్క్రమించును.)

ప — చపలా! ఇటు రమ్ము.

[చపల ప్రవేశించును]

చపలా! వచ్చితివా? నేను వినయాదిత్యునితో నచటఁ బోరుచుందును. ఏద్దైనఁ బనివచ్చునేమో నీ విచ్చటనే నిలువఁబడి యుండుము.

చ — అమ్మా! చిత్తము.

ప — (నిష్క్రమించును.)

చ — ఈమె రౌద్రమూర్తియై రణరంగమునకుఁ బోవుచున్నది. ఈసారి నాప్రాణప్రియుని జంపునేమో — అయ్యయ్యో ! నేని ంకను వాని కర్తవ్యమైన సాహాయ్య మొనర్చినమొదల విశ్వాస

ఘాతుకత యగును గాదా? నావెఱ్ఱి కాని నాసాహాయ్య మాతఁ డంగీకరించునా? ఎందులకు నక్కఱకు రాని యీపతిని సర్వాంగకముగా వదలిపెట్టవలయునన్నబుద్ధి నాకుఁ బుట్ట దేమి? నిరాకరించి నన్నవమానించినను గాసంత యుసుకుఁబోతుతన మైనఁ గలుగ దేమి? త్రోచిపాఱవైచినను జీను జిలాబిపళ్లెర మును జేరినట్లు నిరాకరించినను నే నాతనివలపునే యపేక్షించుచున్నాను. అనివార్యమైన యొకశక్తి నన్నాతనిమీఁదికి గెంటుచుండ నే నేమిచేయఁగలను? అతని ననవలసినమాటలన్నియు నాడితిని. ఆతనికి నాపై దయరానప్పుడు నే నేమిచేయఁగలను? నేను రాజును వలచితి నను సంగతి మహారాణి యెఱుఁగ నేయెఱుఁగను — ఆమెతో నిప్పుడు చెప్పినవినియోగ మేమున్నది? వెల్లడిపడుటతక్క లాభము లేదు. ఈమంట యేదో నామనస్సులోనే యుండి నన్ను దహింపఁజేయవలసినదే కాని యంతకంటె వేఱుగతి లేదు. వా రక్కడ జయమో జయమో యని ప్రాణము లెగయుచుండ నే నిక్కడ మగఁడో మగఁడో యని చేతులు నులుముకొనుచున్నాను ఈప్రపంచమున నెవరిదేవులాట వారిది — కాని అమ్మయ్యో! వినయాదిత్యుఁడు నేలపైఁ బడినాఁడు నేను బోవుదునా! (ముందునకుఁ బోయి) అక్కఱలేదు వెంటనే లేచి విల్లు చేతఁబట్టుకొని యుద్ధమొనర్చుచున్నాఁడు. ఇఁక భయములేదు. ఆహాహా! మహారాణి యెంతభయంకరముగఁ బోరుచున్నది! కాని, అయ్యో — అదియేమి? ఆమెనుదిటికిఁ దెబ్బతగిలినది కాఁబోలు! అమ్మ. అమ్మ. వచ్చుచున్నాను.

(ముందునకుఁబోయి పట్టుకొనఁ బోవును)

[పద్మావతి నుదుటిరక్తముతోఁ బ్రవేశించును.]

ప—వలదు వలదు. దూరముగఁ బొమ్ము. నాశరసంధానమున కడ్డు రాకుము. ఏఁడీ వినయాదిత్యుఁడు? రాజా! రమ్ము రమ్ము. - నిన్నీసారి యమపురి కంపుదును గాచికో—(ముందునకుఁ బరుగెత్తును)

చ—అమ్మా! నుదుట దెబ్బ తగిలినది. రక్తము కాఱుచున్నది. తొందర లేదు. రవంత శాంతించి పోవచ్చును.

ప—నాకు దెబ్బ తగులలేదు. ఏఁడీ రాజు? నన్నేల యడ్డుపెట్టెదవు? రాజా! వచ్చుచున్నాను. జాగ్రత్త. (ముందునకుఁ బోవును)

చ—అమ్మా! మీకు దెబ్బచే దిగ్భ్రమము కలిగినది. వినయాదిత్యుఁడు మీముందువైపున లేఁడు. వెనుకప్రక్క నున్నాఁడు.

ప—నావెనుకప్రక్క యెక్కడనో నా కావైపునకు దారి చూపుము.

చ—అమ్మా! అటు అటు- (త్రిప్పును)

ప—హాహా! చంపెదను. చంపెదను. (పరుగెత్తును)

చ—అయ్యయ్యో! నాపట్టు తప్పించుకొని యిట్లు పరుగెత్తినది.

[నేపథ్యమున]

ఆహా! ఏమి యీరౌద్రస్వరూపము! కాళికాదేవియా? రణదేవతయా? నోటివెంట మంటలు వచ్చుచున్నవే—హా హా!

[మఱియొకరవమున] ఇదిగో- ఈదెబ్బ వహావ్వా- అయినదా?

[నేపథ్యమున]

[మఱియొకరవమున] హాహా హాహా! బుద్ధాచార్యా! నమస్తే.

చ—అయ్యయ్యో! నాభర్తకు బాణము భుజముపై గ్రుచ్చుకొనినది. అయ్యయ్యో- ఇఁక నేమున్నది! ఇఁక నేమున్నది? నే నాతనిఁ గలసికొందును. (ముందునకుఁ బోవును.)

[విజయాదిత్యుఁడు ప్రవేశించును.]

విజ—అన్నియుఁ దిరుగుచున్నవి. ఈరక్తసముద్రమున నన్నియు నీఁదుచున్నవి.

చ—మహారాజా! కన్నులు మూసికొనుము.

విజ—(కన్నులు మూసికొని) పహా హ్హా! కాంతాశిరోమణీ! గెల్చిన నిన్నే గెలువవలయును. చచ్చిన నీచేతనే చావవలయును.

ప—(ప్రవేశించి) చపలా! మహారాజునకు విసరుము. ఆయుధ్రుపట్టున నాతనికి దెబ్బ తగులలేదు, కావునఁ బ్రాణభయము లేదు.

విజ—నా కెవ్వరును విసరనక్కఱలేదు. నే నిప్పుడు కొంత స్థిమితత నొందియున్నాను.

ప—రవంతసేపు సేదతీర్చుకొనుము.

విజ—అక్కఱలేదు (లేచి) నారీమణీ! ధనుర్విద్యలో గట్టివాఁడ నను గర్వము నీమూలమునఁ బరిహరింపఁబడినది.

ప—ఏదీ? జయాపజయము లింకఁ దేలవిదే! నే నొకసారి గాటముగాఁ గొట్టఁబడితిని. నీ వొకసారి కొట్టఁబడితివి. ఇంతమాత్రమున నీగర్వపరిహారణమునకుఁ గారణ మేది? ఇట్లు మనము సాయంకాలమువఱకుఁ బోరాడినను నేను గెలువను. నీవు గెలువవు. అందుచే నే నొక్కమాట చెప్పెదను విందువా?

వి—అభ్యంతర మేమి?

ప—చాపయుద్ధము మానినైచి మనము బల్లెములతోఁ బోరాడుదము. ఒక్కతుత్రిటికాలములో నేదియో యొకటి తేలును.

చ—(అప) రాజా! ఒప్పుకొనకుము. ఆమె కుంతయుద్ధమున మహానిపుణ. భీమునకు గద యెట్లో యర్జునునకు గాండివ మెట్లో యామెకు బల్లె మట్టిది. నీమృతి నిశ్చయము- నిశ్చయము.

ప—మహారాజా ! ఏమి యాలోచించుచున్నావు ?
విన—యుద్ధమునకుఁ బిల్చినప్పుడు వెనుదీయుట క్షాత్రధర్మమా ?
ప—చపలా ! రెండుబల్లెములను దెమ్ము.
చ—నా కేమోకాని కాళ్ళుసు వడఁకుచున్నవి నన్ను క్షమింపుఁడు.
ప—సేవకా ! రెండుబల్లెములఁ దెమ్ము.

[నేపథ్యమున] చిత్తము.

చ—(అప) అమ్మా ! భల్లవిద్యలో మీ కీనడుమ నభ్యాసము లేదు. గురి తప్పిపోవునేమో? ఏల సాహసింతురు? అమ్మా! నాప్రార్థనవిని యుద్ధము మానుఁడు.

[సేవకుఁడు బల్లెములంతోఁ బ్రవేశించును]

ప—(వాని నందుకొని) రాజా ! నీ కేది కావలయునో ఏర్చుకొనుము.
విన—నీయిష్టమైనదాని నొసఁగుము.
ప—(ఇచ్చును.) చపలా ! నీ వాప్రక్క నుండుము. రాజా లేచి సిద్ధముగ నుండుము.
విన—(అట్లుచేయును.) ఇద్దఱు నొకరినొకరు పొడుచుకొనుటకు సిద్ధముగ నూదురు )
ప—చపలా! ఒకటి—రెండు—మూఁడనుము. మూఁడని నీ వను తోడనే మేము పొడుచుకొందుము.
చ—ఒకటి—రెండు—(వారియిద్దఱనడుమకు వచ్చి) హర ఓం హర హర మహాదేవ శంభూ—మూఁడు. (రాజునురాణియుఁ దెల్లఁ బోయి నిలువఁబడియుందురు )
చ—విక్రమాదిత్యమహారాజా ! పొడువక యూరకుంటి వేల ? వీరుఁడవైనయెడలఁ గానిమ్ము. నన్నుఁ జంపకుండనే మారాణిని జంపఁదలఁచితి వేమి ? అది నీతర మగునా ? నీతరము కాదు సరే కదా ! నీకాశ్మీరదేశము నెత్తిమీఁద నున్న కైలాసము నెత్తిమీఁద నున్న యీశ్వరుఁడు త్రిశూలముతో వచ్చినను నాప్రాణ

ముండఁగా మారాణి చెవియందలి శిరీషకుసుమములో నొక్క కేసరమైనఁ గదల్పఁగలఁడా? మారాణికి నుదిటిమీఁద దెబ్బ తగిలినప్పుడే నేను నీశిరశ్ఛేదనమును జేయుట కుద్యమించితిని. కొంచెపుదెబ్బ యగుటచేతను మారాణి యంగీకరింపక పోవుటచేతను నే నప్పు డూరకుంటిని. మహాప్రభువు లగువారు బుద్ధి ప్రకటనమునకుఁ జతురంగఖేలన మాడుకొనునట్లు శౌర్య ప్రకటనమునకు ధనుర్యుద్ధము రవంతసేఁ పాడవచ్చుట తగు నని నే నింతవఱ కూరకుంటిని గాని మీ రొకరినొకరు సామాన్య భటులవలెఁ జంపుకొనుటకు సిద్ధమైనప్పుడు నే నూరకుందునా? ఎత్తినబల్లెమును దింపకుము. నన్నుఁ బొడువుము. అమ్మా! నీబల్లె మిటు తెమ్మా

ప—చపలా! నావిజయమున కడ్డువచ్చి న న్నిట్లవమానింతువా? పో- అవలికిఁ బో.

చ—నీవిజయమున కడ్డురాలేదమ్మా— నీనీచదాసియే కాశ్మీరదేశ చక్రవర్తిని భల్లయుద్ధమున గెల్చెనని వెల్లడించి నీవిజయము పదునాల్గుభువనములఁ బ్రకటించుటకే నే నిట్లు చేసితిని. నిన్నవమానించుటకుఁ గాక బహుభంగుల బహుమానించుటకే నే నిట్లు చేసితిని.

ప—నన్ను నీవు బహుమానింపనక్కఱలేదు. నే నీమహారాజుతో యుద్ధమొనర్చెదను. నేను నీసాహాయ్యమును గాని యభ్యంతరమును గాని సహించుదానను గాను. నే నీతనితో ద్వంద్వయుద్ధమొనర్తు నని యిచ్చినమాట చెల్లించుకొన వలదా—నీవు పో—

చ—ఆమాటప్రకారమే కాదా వింటితో ద్వంద్వయుద్ధము జరిగినది. తిరుగ యుద్ధ మెందులకు? ఈభల్లయుద్ధ మనవసరముగ నవాంతరముగ వచ్చినది. మొదట నీమహారాజు రాయబారిచేఁ

బంపిన లఘువాక్యములవలన స్త్రీలపక్షమున నాతనికై నీకుఁ గోపము కలిగినది. ఆకోపమును దీర్చుకొనుట కాతని బంధించి తిరుగ విడిచితివి. అంతటితో వైర మాఁగిపోవలసినది. తరువాత జరిగినయుద్ధమున మీసేనాపతిని వారు పట్టుకొనిరి. వారిమంత్రిని మీరు పట్టుకొంటిరి. అనగ మనకత్తిని వారూడ లాగికొనివారు, వారిబుద్ధిని మన మూడలాగికొంటిమి. అంతటితోనైన యుద్ధ మాఁగిపోవలసినది. అటుపైని కేవల మనవసరముగ మీవింటియుద్ధము కలిగినది. ఆతనిచేతికి దెబ్బతగిలినప్పుడే నీవు మఱియొక్క వ్రేటుచే నాతనిఁ జంపియుండవలసినది—చంపుట నీ కిష్టముకాక కదా యూరకుంటివి ? ఆతఁడు నిన్ను నుదుటఁ గొట్టినాఁడు, నీ వాతని బాహువునఁ గొట్టితివి. ఇద్దఱు సమముగా విద్యను బ్రకటించిరి. కావలసినది పరాక్రమప్రకటనము కాని ప్రాణహరణము కాదే! అంతటితోనైన యుద్ధ మాఁగిపోవలసినది కాదా ? అది మూఁడవసారి, ఇఁక యుద్ధము పెంచుట బుద్ధిహీనత—అమ్మా! యుద్ధము కేవలము పందెమువంటిది. మూఁడుపందెము లైనవి. అదృష్టదేవతను మూఁడు సారులకంటె నెక్కువ పరీక్షింపఁ దగదు. అయినను నీవే యీ భల్లయుద్ధమును గల్పించితివి. భల్లములఁ దెమ్మని నీవు నన్నుఁ గోరఁగ నే నంగీకరింపలేదు. అమ్మా! నీ విఁక యుద్ధ మొనర్పఁ దగదు. యుద్ధ మొనర్చుటకు మీ కంతమహావాంఛ యుండునా కానిమ్ము. కాని నన్నుఁ జంపినతరువాతమాత్రము యుద్ధ మొనర్పవలసినది. నేను జచ్చినపిమ్మటఁ గొంతసేపు నిదానించి నాయొడలు పూర్తిగాఁ జల్లఁబడినట్లు నిశ్చయపఱచుకొన్న తరువాత యుద్ధ మారంభింపవలయును. ఎందుల కిట్లంటినో

చెప్పనా? ఏమాత్రపువేడి నాశరీరమందు నిల్చియున్నను, నే నెగిరి మీబల్లెములు గంతగులకుండ నిశ్చయము.

—చపలా! నీ కంత పట్టుదలకు?

—(అపవారించి) అమ్మా! అడుగకుండనే చెప్పవలసియుండఁగా నడిగినతరువాత మానుదునా? నాకిది తప్పుపనిలోఁ బట్టు కాదు- న్యాయమందు దీక్ష. మీరు కొంతకాలమునుండి కుంతసాధనము లేకుండనున్నారు. మీ రెంతచాకచక్యముకలవార లయ్యును నెటుపోయి యేమౌవచ్చునో! మీరు యోగినులవలెఁ గాలక్షేపము చేయుచున్నారు. స్త్రీల యున్నతదశ నపేక్షించి మీ రీరాజ్యమును బాలించుచున్నారు. మీరు లేకున్న యెడల స్త్రీరాజ్యపుగతి మాట యటుంచుఁడు స్త్రీల గతి మాట యేమి? ఎన్ని కోట్లస్త్రీల యభ్యుదయము మీక్షేమమున నిమిడి యున్నదో యోచించుకొంటిరా? ఇంతకుఁ బ్రాణము పోఁగొట్టుకొనవలసిన మహావసర మేమి వచ్చినది? ఈ పాపము మీ కంటకుండ మిమ్ము గాపాడుట నావిధి నే నిందున నెంతపట్టుపట్టినను దప్పులేదు. అదిగాక మీరు వైరాగ్యసంపన్నలే- భవవాంఛాదూరలే- కాంతాదశాభివృద్ధివాంఛ తక్క నేవాంఛయు మీకు లేదే—అట్టిచో నీమహారాజును జంపవలయుననికాని యాతనిచేఁ జావవలయుననికాని దృఢమైన సంకల్ప మెందులకు? ఇది తప్పులన్నిటిలోఁ దప్పు. మీపట్టు మీరు విడిచి మిమ్ము రక్షించుకొని కాంతాలోకమును రక్షింపవలయును.

ప—అతఁ డేమనునో!

చ—ఆతనితో నేను మాటలాడుదును. (అప) నే నిట్టు లడ్డురాకుండునెడల నీ వీసరికి వైతరణి దాఁటుచుందువు. సామాన్య జీవులు వైతరణిని బదవదినములఁగాని దాఁటరని చెప్పుదురు కాని,

మా రాణిగారి బల్లెపుఁబోటు నిన్నుఁ బదినిముసములలో నే యక్కడ కెగురఁగొట్టఁగలదు. నీప్రాణము నేను గాపాడె దనని చెప్పినట్లు కాపాడితినా? ప్రాణప్రియా! నీ విక్కడ నెందులకు? శీఘ్రముగఁ గాశ్మీరమునకుఁ బొమ్ము. ఇందు స్త్రీపురుషుల యుద్ధమునకైన సందున్నది కాని యామె భల్లఘాతము న కడ్డు లేదు. నీవిచ్చటకు వచ్చినవేళ మంచిదికాదు. మా స్త్రీభటులు కానఁబడకపోవుటచే నీభటులు వెఱ్ఱులెత్తి తిరుగుచున్నారు. నీసేనాధిపతి లేచిపోయినాఁడు. ప్రధానుఁడు బద్ధుఁడైయున్నాఁడు. ప్రాణము దక్కించుకొని త్వరగఁ బోవుటకంటెఁ గర్తవ్యము లేదు భరతఖండమంత గుప్పెటలోఁ బట్టఁదగినమహాచక్రవర్తి స్త్రీచేఁ జచ్చినాఁడన్న యపకీర్తి లోకమున నేల వినుతువు?

విన—ఆమాట కేమిలే! ఎవరెవరిచేఁ జత్తురో యెవరు చెప్పఁగలరు? కాని యామెచేఁ జచ్చుట నా కపకీర్తి కాదు. ఇదివఱకు జరిగినవింటియుద్ధమున నామె మహాపరాక్రమసంపన్న యని నాకుఁ దెలిసినది. మిక్కిలి సంతోషించితిని.

చప—నీవు పరమయోగ్యుఁడ వని పరాక్రమనిధి వని యామెకూడ మిగుల సంతోషించుచున్నది. మీరు సఖ్యపడుట సర్వశ్రేయము కాదా?

విన—నా కభ్యంతరము లేదు.

చ—అమ్మా! మీసఖ్యమును మహారాజపేక్షించుచున్నాఁడు.

ప—సంతోషమే. (ముందునకు వచ్చును)

విన—రాజ్ఞీమణీ! నేను స్త్రీలనుగూర్చి రాయబారమునఁ బలికించిన మాటలు మన్నింపుఁడని యిదివఱకే యంటిని. ఇప్పుడు తిరిగి కోరుచున్నాను.

—చెవులు పవిత్రములగునట్లు నీయోగ్యతనుగూర్చి వినియుంటిని నీపరాక్రమమును బరీక్షించి పరమానందభరితనైతిని నన్ను నీ మిత్రగణములోఁ జేర్చుకొనినందులకుఁ గృతార్థనైతిని.

—ఇట్టి యత్యంతసుఖావసరమున నేనైన శుభము లాచరించుట మంచిది కావున, దుర్గమ్మపెండ్లి మందాకినమ్మపెండ్లి యిచ్చట మీరు జరిగించెదరుగాక!

—దుర్గ వెడలిపోయినది కాదా ? మందాకిని దామోదరశర్మను బెండ్లి చేసికొనునా ?

చ—అఁడుదానికి మగవాఁ డనఁగఁ జేదా అమ్మా !

ప—ఇష్టమైనయెడల నటులే కావచ్చును. కాని దుర్గ యెక్కడ నున్నది!

చ—ఆమె యుద్భటభట్టుతోఁ దనయింటఁ బ్రచ్ఛన్నస్థలమున నున్నది.

ప—ఆలాగా ! సేవకా ! నీవు దుర్గయింటికిఁ బోయి యుద్ధము నిలుపి నదనియు నీకోరికప్రకారము జరిగింతు ననియు నే నంటి నని చెప్పి దుర్గను దానిభర్త నుద్భటభట్టు నిటకుఁ దీసికొని రమ్ము.

[నేపథ్యమున]చిత్రము.

విన—చపలా ! దామోదరశర్మ వివాహమున కంగీకరించినాఁడా?

చ—మహారాజా ! అతఁడు మగవాఁడు.

[దుర్గ—ఉద్భ—ప్రవేశింతురు ]

ఉద్భ—మహారాజా ! నమస్కారము. క్షమింపవలెను.

విన—ఉద్భటభట్టా ! తుద కిట్లు చేసితివా ?

ఉ—గీ. కమ్రకవితాసమర్థతఁ గరుణతోడ
నా కొసంగిన బుద్ధివిజ్ఞానమూర్తి

యిట్టిచాపల్యమును గూడ । నిచ్చినాఁడు
శ్రీమహారాజ! నే నేమి । చేయఁగలను ?

చ—సిగ్గుమాలినవాఁడా! సన్యాసియైన బుద్ధదేవుఁడు నీకుఁ జాపల్య మిచ్చినాఁడా?

ప—దుర్గా! సిగ్గుపడనక్కఱలేదు. దగ్గఱగ రమ్ము.

చ—అమ్మా! పెండ్లికూఁతురు గాదా? దాఁగి పట్టుకొనితీసికొనివచ్చిన నుగాని రాదమ్మా! (దుర్గనుబట్టుకొని) అమ్మా! ఇంతకాలము నుండి నేర్చిన యుద్ధతంత్రి మొక్కనిమునపములో నెగురఁగొట్టితివా? నిన్నమొన్నటికిఁ గోటచుట్టు పరగడలుద్రొక్కినదాన నీవు కదా! ఇంతలో నీముద్దరాలితన మెక్క డవచ్చినదమ్మా?

దు—అమ్మా! నమస్కారము.

ప—కళ్యాణమస్తు.

[నేపథ్యమున]

మందాకినమ్మతో దామోదరశర్మవచ్చుచున్నాఁడు.]

మం.—రాజ్ఞీవతంసమా! నమస్కారము.

ప—మందాకినీ! నన్ను వదలిపోవుదువా?

మం—అమ్మా! దామోదరశర్మను బంధించి చపల నాయొద్దకుఁ బంపినది— అందుచేత—

చ—పంపితిని గాని నీ వతనితో గుటగుట లాడుమంటినా?

మం—అమ్మా! అయిన దేదో యైనది. ఆఱునెల లట యాఱునెల లిట నుందును.

చ—మిగిలినయాఱునెలలపాపముమాత్రము రాణిగారి కెందులకు?

విన—దామోదరశర్మా! సందేహింపనక్కఱలేదు. దగ్గఱకు రమ్ము.

చ—(అప) సిగ్గుచేతఁ గాదయ్యా! నేను దిరుగ లెంపకాయ కొట్టుదు నేమో యనుభయముచే సంశయించుచున్నాఁడు.

దా—మహారాజా! నమస్కరించుచున్నాను.

వి—మంత్రీ! నీవు నన్ను రాణిగారి కారాబంధమునుండి తప్పించిన పుణ్యాత్ముఁడవు. నీయభీష్టము నే నభ్యంతర పెట్టుదునా? రాజ్ఞీమణీ! మీతో యుద్ధము మా కిట్లు పరిణమించినది.

చ—ఇంతకంటె నెట్లనుకొంటివయ్యా!

ప—యుద్ధమున మీకుజయము కలుగలేదని సందేహ మక్కఱలేదు. మాపిల్లలను మీతోఁ దీసికొనిపోవుచుండుటచే మీకే జయమని భావింపవలయును.

వి—జయమున కేమి యపజయమున కేమి కాని, నీవంటి కాంతామాడామణిని జూచుటచే నాజన్మము కృతార్థ మైనది.

ప—మహారాజదర్శనమున నేనుగూడ నట్లే భావించుచున్నాను.

విన—గీ. వసుధ నెందఱో నను(బోలు । ప్రభులు కలరు
తన్వి! నీవంటి రాజ్ఞీవ।తంస మొకతె
యైన నుండఁగావచ్చును । గాని జగతి
నింతదాసిసిమాత్రమీ । క్షింపలేదు.

చ—(అప) ధనమీయలేని కృపణప్రభువు లర్థులకు బిరుదము లిచ్చినట్లు నా కీయఁదగిన దేదో యీయలేక వ్యర్థమైన యోగ్యతా పత్రిక నిచ్చితివా- నీవే తీసికో.

ప—మహారాజా! శుభము లాలసింపనేల? త్వరగఁ గల్యాణమండపములోనికిఁ బోవుదము. సకలవైభవములతోఁ గల్యాణములు జరుగునట్లు భగవంతుఁ డనుగ్రహించునుగాక!

చ—ఊరిలోవారు కాక కోటలోమట్టునకు మూఁడువేలముత్తైదువలు మంగళపుఁనారతిపళ్ళెరములయొద్ద సిద్ధపడినప్పు డింతకంటె సౌభాగ్యము మఱియొకటి యేమున్నది.

ప—ఇప్పు డిక్కడఁ గావలసిన దేమియు లేదు గదా!

వి—ఏమియు లేదు. అయిన నిట్లు కావలయును.

గీ. ధరణి యీతిబాధలు లేక । తనరుఁగాక
ప్రజల యన్యోన్యవైరముల్ । పాయుఁగాక
కవిత రాజపోషణమునఁ । గ్రాలుఁగాక
నీతిపాలనమున రాజు । నెగడుఁగాక.

అంద—తథాస్తు.

ఇది షష్ఠాంకముతో సర్వము
సంపూర్ణము.

